# దేవతల యుద్ధం

[ నవల ]

విశ్వనాథ సత్యనారాయణ



విశ్వవాణి పబ్లిషర్స్, విజయవాడ.

విశ్వవాణి ప్రచురణ
ద్వితీయ ముద్రణ
జూలై 1960
వెల : రూపాయిన్నర

ఇది ఒక రాజకుటుంబములో జరిగిన కథ. క్రొత్తదేవతలు ప్రాతదేవతలు మనుష్యుల విశ్వాసాలవలన పరిస్థితులు ఎట్లా మారి సంఘంలో కొందరు బలి అవుతారో, ఆ కథ. ఇక చదవండి.

ముద్రణ :
విజయలక్ష్మి ఆర్టు ప్రింటర్సు,
విజయవాడ.

# దేవతల యుద్ధం

'ఓహోహో! శాస్త్రులుగారా! ఎన్నాళ్ళకు వచ్చారు!'

వచ్చిన శాస్త్రులుగారు చేతిలోని పాత్రద్వయం వాకిటిలో ఉన్న బల్లమీదపెట్టి, దర్భాసనం గోడకానించి, వాకిట్లోఉన్న పంపుదగ్గర పాదప్రక్షాళనం చేసి, బుజంమీద ఉన్న ఉపవస్త్రంతో తుడుచుకొని ఒక కొయ్యకుర్చీమీద కూర్చున్నాడు.

కూర్చున్న తరువాత ఇలా అన్నాడు.

'ఔనండీ! మీయింటికివచ్చి పదేండ్లు అయింది. ఈమధ్య నేనీప్రాంతాలల్లో ఉండటంలేదు కదా! మిమ్మల్నం దరినీచూచే చాలాయేండ్లయింది. మీరు పెద్దవాళ్ళయినారు. ప్రయోజకులైనారు. మీ నాయనగారి తపశ్శక్తిఫలం. ఇంకోచోటికి పోదా మనుకున్నాను. ఎక్కడికి పోయినా అనాచారపు కూడు తినాలి. మా కేదో చుట్టాలున్నారు. పోదామా అంటే, వాళ్ళు మగవాళ్ళు సరే ఆడవాళ్ళుకూడా మడి కట్టుకోరు. ఉతికిన బట్టలు కట్టుకొని వంట చేస్తారు. శుద్ధమైన కొంప అని మీయింటికి వచ్చాను. వైశ్వదేవం చేసినవాణ్ణి. మరొక చోట నీళ్ళు ఎలా పుచ్చుకోను?'

ఈమాటలు వింటూనే నీలకంఠశాస్త్రినీళ్ళునమిలేడు. సమాధానం చెప్పలేదు.

శాస్త్రులుగారు ఏమో అధికారదర్పం అనుకున్నాడు. అన్నాడు కదా 'అయ్యా నేను స్నానంచేస్తాను. బావి ఉన్నదా?' అని.

నీలకంఠ:- బావి లేదండీ! పైపే ఉంది.

శాస్త్రి:- ప్రక్క నెక్కడైనా బావి ఉన్నదా?

నీల.- ప్రక్కవారి దొడ్డిలో ఉంది.

శాస్త్రిల్లుగారు చిన్నగుడ్డ కట్టుకొని చేతిలో చెంబు తీసుకొని వారియింటికి వెళ్ళేడు.

నీలకంఠంగారు ఇంటిలోనికి పోయి భార్యతో ఇట్లా అన్నాడు. 'ఏమి చేస్తున్నావు. ఇవ్వాళ తలనిండా స్నానము చేసి ఒకచీర ఆరవేసికొని వంట చెయ్యాలి. తెలుస్తోందా?' సరోజా!'

సరోజ:- ఏమి యివ్వాళ? మన గురువుగారికి కూడా మడి అక్కరలేదు కదా!

నీల:- గురువుగారు కాదు. ఒక శాస్త్రిలుగారు వచ్చారు. ఆయన మాయింటికి నా చిన్నప్పుడు వస్తూ ఉండేవాడు. ఇంకోయింటికి పోతే ఆచారం సాగదని మన యింటికి వచ్చాడు.

సరోజ:- మడేకట్టుకుంటా లెండి.

నీల:- మడేఅంటే పట్టుబట్ట కట్టుకుంటే చాలదు. వేరే చీరతడిపి ఎండవేయాలి. ఆ చీర ఎండేలోపుగా తడిబట్టే కట్టుకోవాలి.

సరోజ:- నాకు జబ్బు చేస్తుంది బాబు; నేను చెయ్యలేను.

సీల: అలా పెంకెపట్టు పట్టక ఈపూటకు మాత్రం మర్యాదదక్కించు. నిన్ను బతిమాలుకుంటాను.

సరోజ:- సరే రానియ్యండి.

శాస్త్రిలుగారు స్నానంచేసి వచ్చారు.

ఆయన వచ్చేలోపుగానే సరోజ పడమటిల్లు కడిగి, తుడిచి, పీటవేసి, తోమినచెంబు లక్కడ పెట్టింది. బంట్రోతును పిలచి కోమటింటికి పంపి విభూతిపండు తెప్పించింది. శాస్త్రిలుగారు వచ్చారు ఆయన పీటమీద కూర్చున్నాడు.

సరోజ:- బాబూ! విభూతి అదిగో అన్నది.

శాస్త్రిలుగారు:- అక్కరలేదు అమ్మా! నాదగ్గర యజ్ఞకుండభస్మం ఉన్నది. ఎప్పుడూ మారేడుకాయలో నాదగ్గర ఉంచుకుంటాను.

సరోజ స్నానంచేసింది. తడిబట్ట కట్టుకుంది. వంట పనిమీద ఉంది ఆవిడ ఆచారం, ఆవిడలక్షణాలు చూస్తే శాస్త్రిలుగారికి చాలా సంతోషంఅయింది.

సరోజకి ఇద్దరు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. పెద్ద వాడు మగపిల్లవాడు. తరువాత ఇద్దరు ఆడపిల్లలు. చంటి వాడు మగశిశువు.

ఆరోజున తల్లి పిల్లల నెంతైనా కోప్పడవలసివచ్చింది. అలవాటుకొద్ది పిల్లలు తల్లిని ముట్టుకోవస్తారు. తల్లి దూరదూరంగా పోయి, తొలగి, 'నాయనా! ముట్టుకోకూడదు మడి' అంటుంది. ఆ పిల్లలకు మడి అంటే అర్థంకాలేదు.

ఆవిడ బంట్రోతును పిలచి పిల్లల్ని దూరంగా తీసుకొని వెళ్ళమంది. వాడు అలవాటుకొద్దీ పడమటింటిలోకి రావచ్చాడు. ఆవిడ వానితో రావద్దని సంజ్ఞచేసి తనను ముట్టుకోవచ్చే పిల్లలను బెదరించి బైటకు పంపించేందుకు చెప్పరానంత యిక్కట్టుపడ్డది.

నీలకంఠశాస్త్రి ఆరోజున మడికట్టుకోక తప్పింది కాదు. పిల్లలకు తండ్రిదగ్గర కూచోటం అలవాటు. వాళ్ళకు చొక్కాలు వదలించి ఒంటిమీద నీళ్ళుపోసి తీసుకవచ్చే టప్పటికి తలప్రాణం తోకకువచ్చింది.

పిల్లలకు లీలగా స్ఫురించింది.

'క్రొత్తగా ఎవరోవచ్చారు. ఆయన గురువుగా రందామా కాదు. గురువుగా రైతే పడమటింటిలో కూచోడు. ముందర గదిలో తివాచీపైన అటూయిటూ మెత్తని పట్టుదిండ్లు పెట్టుకు కూచుంటాడు. ఈయన ఎవరో? మొత్తానికి తాము కొంచెం అణగి మణగి ఉండాలి.'

శాస్త్రిల్లుగారు జపమంతా అయింతర్వాత పొయ్యి దగ్గరకు వెళ్ళి నిప్పులు బైటికితీసి,. అక్కడే అగ్నిహోత్రం చేసి బలులు వేశాడు.

తరువాత భోజనం ఆరంభమైంది.

శాస్త్రి:- నాయనా! మీతండ్రిగారు ఎంత జపి! ఎంత తపశ్శాలి! ఇవ్వాళ మళ్ళీ మీయింటిలో నేను అమృతమస్తు అంటున్నా నంటే మళ్ళీ నాకేదో మంచిరోజు వచ్చిందన్న మాట. మీ నాయనగారుపోయి యెన్నాళ్ళయింది?

నీల:- పన్నెండేళ్ళు కావచ్చిందండీ!

శాస్త్రి:- ఆయన ఒక సిద్ధుడు. నాయనా! నీకు తెలియదట గాని మీ యింటిలో బాల తిరుగుతూ ఉండేది. నే నొకసారి వచ్చాను. నేను సావిట్లో పడుకున్నాను. ఒక పన్నెండేండ్ల పిల్ల గజ్జెల మోతతో అటు యిటూ తిరుగు తూంది. ఆవిడ అందం ఏమని చెప్పను! అందం అలా ఉంచి ఆపిల్లను చూస్తే గుండె దడదడ కొట్టుకుంది. మీ నాయన గారి నడిగేను. స్వామిగారూ! ఈ పిల్ల ఎవరండీ? అని. ఆయన యేమీ సమాధానం చెప్పలేదు. నాకు తరువాత తెలిసింది. ఉపాసకులను నేను చాలా మందిని చూశానుగాని మీ నాయనగారివంటివారిని చూడలేదు. తల్లి అల్లా ప్రత్యక్షంగా-ఏమి అదృష్టం! ఏమి సిద్ధి! ఆయన ఉదయాన్నే లేస్తూ స్నానంచేసేవారు. ఆ కూచోటం కూచోటం పొద్దు తిరిగేది లేచేటప్పటికి. ఆ బాలయంత్రం దేవతాపీఠం వేరే దేవాలయం గర్భగుడిలాగుండేది. అదంతా ఏమైందిబాబూ?

నీల:- ఆయన పోయిన పన్నెండవ రోజున ఎవరికో బ్రాహ్మడికి దానంచేశాను.

తరువాత పదినిమిషాలు శాస్త్రిల్లుగారు మాట్లాడ లేదు. మళ్ళీ అన్నాడు-బాలయంత్రంకూడా యిచ్చారా?

నీల:- ఇచ్చాను.

శాస్త్రి:- ఎంతసేపు పడుతుంది? బాబూ! ఒక్క పదినిమిషాలు పడుతుంది. సరే మీరు ఉద్యోగస్తులు కనుక దేవతార్చన చేయటం పడదు. బాలయంత్రంమాత్రం యివ్వ కూడదు. అందులో అది మీ నాయనగారు సిద్ధిపొందిన యంత్రం. బాల మీ యింటిలో స్థిరనివాసం ఏర్పరచు

కుంది. ఆమెను వెళ్ళకొడితే సామాన్యంగా వెళ్ళదంటారు. ఊరకే అష్టోత్తరశతం చెప్పి కొబ్బరికాయకొడితేసరిపోయేది.

సరోజ:- బాబూగారూ, అమ్మవారు ఇంటినుంచివెళ్ళ లేక చాలా యిబ్బందిపడుతోంది. మమ్మల్నీ యిబ్బంది పెడుతోంది.

ఈ ప్రసంగం సాగినంతసేపూ నీలకంఠశాస్త్రి మొగము మొరకటించుకుని కూచున్నాడు. సరోజ యీమాట అన్నంతనే సరోజవంక కోపంగా చూశాడు. పెద్దపిల్లవాణ్ణి దగ్గరకు తీసుకొన్నాడు.

వెంటనే శాస్త్రుల్లుగారు నివ్వెరపోయేఅంత పని జరిగింది. తండ్రి దగ్గరకు తీసుకొంటూంటే పిల్లవాడు దగ్గరకు పోక తండ్రిని విదలించి లేచి నుంచొని కళ్ళు పెద్దవిచేసి తండ్రిని లాగి చెంపకాయ కొట్టేడు. అన్నం విదలించి యిల్లంతా చిమ్మేడు. ఎంగిలంతా అందరిమీాదా పడ్డది. శాస్త్రిగారు మైలపడ్డాడు. తండ్రి బిడ్డను దగ్గరకు తీసుకొని 'నాయనా! నాయనా!' అనటం, వాడు-పదేండ్లవాడు-బండ బూతులు తిట్టడం. ఇల్లంతా కంగాళీ అయిపోయింది.

ఇంతలో బంట్రోతు పడమటింటిలోకి వచ్చాడు. కుఱ్ఱవానిని పట్టుకున్నాడు. రెండుదెబ్బలు వేశాడు. తీసికొని వెళ్ళాడు. కుఱ్ఱవానిని గదిలోపెట్టి తాళంవేశారు. వాడు ఏడ్పులు, పెడబొబ్బలు, తలుపులు పగులగొట్టుటలు.

శాస్త్రిగారికి భోజనం అప్పటికి పూర్తికావచ్చింది. మజ్జిగ పోసుకొని సగం తిన్నాడు. పిల్లవాడు మెతుకులు విసరటంతోటే అన్నం వదలి లేచిపోయినాడు. బంట్రోతు

రావటంమాత్రం ఆయన చూడలేదు. అప్పుడాయన దొడ్డిలో చేయి కడుక్కుంటున్నాడు. ఆయన కేమీ తోచ లేదు. ఈ సందర్భ మాయనకు అర్థంకాలేదు.

నీలకంఠశాస్త్రి పెద్దకొడుకు పేరు స్వామి. అతని తాతగారి పేరు. స్వామికి అయిదేండ్లు వచ్చినప్పటినుండి యిదే తంతు. తండ్రిని కొడతాడు, తల్లిని కొడతాడు. చెల్లెళ్ళనెత్తురు కళ్ళచూస్తాడు. బడికి పంపిస్తే చదివినంత సేపు చదువుతాడు. ఏదోవేళ రిమ్మపుట్టి పంతుల్ని బూతులు తిడతాడు. చేతిలో ఏదివుంటే అదిపెట్టి కొడతాడు. అందుచేత బడిలోకి పంపించటం మానివేశారు. ఇంటిదగ్గరే ఒక ప్రైవేటు మాష్టర్ని పెట్టి చెప్పిస్తూవుంటారు. 'నే నివ్వాళ చదువనూ' అంటే దాని కప్పీలు లేదు. ఇలా నెల కిరవైరోజు లుంటాడు.

నీలకంఠశాస్త్రి చాల సాధువు. భార్యను కోపపడడు. పిల్లవాండను కోపపడడు. వాడు చదువనంటే మేష్టరుతో సరే రేపు రావయ్యా అంటాడు. అతనికి జీతం తగ్గించడు.

స్వామిని వేయికండ్లతో చూడాలి. ఉన్నవాడు ఉన్నట్లుగా యెప్పుడో యెక్కడికో వెళ్ళిపోతాడు. ఇట్లా యిదివరకే అయిదారుసార్లు జరిగింది. రెండు మూడు దినము లైన తరువాత అతని అంతట అతనే రెండు మూడు సార్లు తిరిగి వచ్చాడు. ప్రతిసారీ వెతకలేక బంట్రోతులు విసికేరు. ఏడవలేక సరోజ బాధపడ్డది. దిగులుపడలేక నీలకంఠశాస్త్రి చిక్కిపడ్డాడు.

ఈ కుఱ్ఱవాని దగ్గర యింకా చాల లక్షణాలువున్నవి. ఇంటికి గురువుగారు వస్తాడు. గురువుగారిని తిడతాడు. గురువుగారు నవ్వి ఊరుకుంటాడు.

ఆ కుఱ్ఱవాని కెప్పుడూ ఒకభయం. తండ్రి తనను చంపుతాడని ఆవేశంవస్తుంది. వచ్చినప్పుడల్లా పూర్వం ఒక్కరోజుండేది. అది క్రమక్రమంగా పెరిగి యిప్పుడు నాలుగురోజులుకూడా ఉంటోంది.

తండ్రిని 'నీవు నన్ను చంపుతావు. చంపటానికి ఆలోచిస్తున్నావు. కత్తి తెచ్చి పెట్టెలో పెట్టా' వని, ఒకసారి, పిస్తోలు తీసుకోవచ్చావని యింకొకసారి ఆకత్తికోసం, పిస్తోలు కోసం వెతుకుతాడు. పెట్టెలన్నీ బ్రద్దలకొడతాడు. చీరలు చింపుతాడు. వెండిగిన్నెలు బ్రద్దలకొడతాడు. ఒకటేమిటి?

౨

అది ఒక చిన్నజమీందారీ. పూర్వము ఇరవై వేల కన్న ఎక్కువ వచ్చేదికాదట. ఇప్పుడు లక్షదాకా ఆదాయం ఉంది. ఇదంతా ఇప్పటాయన తాతగారు చేశారట.

[ఏదో భారతంలో చెప్పినట్లు నదులపుట్టుక, వీరుల పుట్టుక నిర్ణయించటానికి వీలులేదు. అట్లాగే ధనవంతుల పుట్టుక నిర్ణయించటానికి వీలులేదు.] ధనము భోగుచేసిన వాడు, ఎల్లాభోగుచేశాడు? అనే విషయ పరీక్ష చేసేవాడు చేయవచ్చు. కాని; అతని కులంలో పుట్టినవాళ్ళదేమి తప్పు ఉంది? ఆ జీవుడు పూర్వపుణ్యం చేసుకున్నాడు. ఆ ధనానికి వారసుడుగా పుట్టేడు.

ఈ జమీందారీకి లక్ష వస్తుందంటే శంచక్క గా వస్తుంది. కొన్ని జమీందారీల్లో మూడు, నాలుగు, పది లక్షలు వస్తవి అంటారు. అవన్నీ వసూలు కావు. రెండేళ్ళకో, మూడేళ్ళకో రైతులు బకాయి పెట్టటం; జమీందారుగారిదగ్గరకు వచ్చి 'అయ్యా! చాలా అప్పుపడ్డాము; పంటలు లేవు; తీర్చలేము; మీ రనుగ్రహించాలి' అనటం; ఆయన బాకీ రద్దుచేయటం; కొన్ని శిస్తులు హైకోర్టుదాకా వెళ్ళటం; కొన్ని బాకీలు ఆస్తి జప్తుఅయికూడా రద్దుకావడం. ఇది యిలా ఉండగా ఖర్చు పదిలక్షల రూపాయలమీద జరగటం; ఇది యీ దేశపు నమూనా అనుకోండి.

వాళ్ళ తాతలనాడు యేభై ఎకరాలు ఉండేది. ఐదు గురు తండ్రులూ తలాపదీ కొంత అప్పుతో పంచుకున్నారు. తాము ఎవరికివాళ్లు యిద్దరు ముగ్గురు అన్నదమ్ములు. కార్య కరామత్తులు, ఆ పాతనాటి దర్జాలు, షోకిళ్ళూ.

లోకమంతా యిలా ఉంటూంటే ఈ జమీందారుగారు అదేమీ లేదు. లక్షవస్తూంటే లక్షకులక్ష నిలవే. మరెట్లా సాగుతూందీ అంటే స్వాంతకమతం ఉంది. ఇంకా అనేక మార్గాలున్నవి.

ఆ జమీందారుగారికి యీ నీలకంఠశాస్త్రి దివాను. దివానూ, మేనేజరూ వగైరా. ఈ దివానుగారిది ఒకమతం. రాజాగారి మతంలో దివానుగారు అప్పుడప్పుడు కలుస్తూ ఉంటాడు. మతం అంటే అభిప్రాయం కాదు. అసలు మతమే.

వెనక అధ్యాయంలోని కథ జరిగిన మరునాడు—ఊళ్లో ఒక ప్రార్థనామందిరం ఉంది-అందులో జమీందారు గారి మతస్థులందరూ కలసి - ప్రార్థనచేస్తున్నారు.

ఈమతం వేదబాహిరమైన మతంగాని వేదాంత బాహిరమైన మతంకాదు. మోక్షం ఉంది అనుకోండి; ఉందో లేదో అలాఉంచండి. కథకోసం ఉంది అనుకుందాం. ఆ మోక్షం పొందాలి అంటే జీవుడికి సంస్కారం ఉంటుంది. ఆసంస్కారాన్నిపట్టి చిన్నచిన్న వర్ణాలు ఉంటవి. ఆ జీవుడు ఆవర్ణంలోపుట్టేడు అంటే ఆసంస్కారబలమేను. ఆమనుష్యుడు ఆవర్ణంలో పుట్టటానికి అర్థం మోక్షసాధనదృష్ట్యా అతని సాధనసంపత్తిలోని ఒకతరగతికాని; లౌకికమైన జ్ఞానము; సాహసం, సంపత్తి తక్కిన వర్ణాలతోపాటు ఉండకూడదని కాదు. ఈరీతిగా ఉత్తమసంస్కారం పొందితే ఉత్తమ వర్ణంలో పుడతాడని; అప్పుడు ఉత్తమాశ్రమం స్వీకరిస్తాడని; అది మోక్షానికి మార్గం అనీ; వేదం చెప్పిందనుకుందాం. అట్లా వేదం చెపితే క్రొత్తగా ఏమిచెప్పింది?

ఒక యింటిలో పుట్టాలి; ఇంగ్లీషు చదువుకునేందుకు జీతాలు కట్టేందుకు డబ్బు ఉండాలి; ఫష్టు ఫారం మొదలు యం. ఏ. వరకూ చదవాలి. అప్పుడు వెళ్లితే దేశాలు వెళ్ళాలి; అప్పుడు పెద్దఉద్యోగాలు రావాలి.

ఇది రైటూనూ, వేదం చెప్పేది తప్పూనా? నిజానికి రెండూ తప్పుకావచ్చు; రెండూ రైటుకావచ్చు. చదువు అక్కరలేదు; కష్టమూ అక్కరలేదు; కొందరికి పెద్ద ఉద్యోగాలు రావటంలేదా? అంటే; అట్లాగే కులమూ అక్కర

లేదు; యజ్ఞయాగాదులు అక్కర్లేదు; మోక్షం రాకూడదు అంటే అదియిదీ కూడా కొందరికి వస్తుంది.

ఇది వచ్చినవాళ్ళు లేరా? నందనారు ఉన్నాడు. వేమన ఉన్నాడు, ఇంకా చాలామంది ఉన్నారు. వీళ్ళు అందరూకాదు. విశేషప్రకృతి కలవాడు సృష్టిలో కేటాయింపు. అందరూ వాడికిమల్లేకారు. అందరికీ కలిపి మోక్షమతమని ఒకటి పెట్టాము. అది ప్రార్థనతో తేలిపోతుంది అన్నాము. ప్రార్థనచేయని సమయంలో అందరూ చేసే ఘోరాలే మనమూ చేస్తున్నాం. అది అలా వుంచండి.

ప్రార్థనచేసే సమయంలోనైనా మనమనస్సు మన దగ్గరలోఉందా? మన మేదో వ్యామోహపడి ఒక క్రొత్త మతాన్ని స్వీకరించిన మాత్రాన అంతసులభంగా మనస్సు వశమయ్యేది అయితే, యీ వేదాలెందుకు? యీ ఉపనిషత్తులెందుకు? యీ తపస్సులెందుకు?

సామాన్య జీవితంలో చూడండి, ఒక సత్కార్యం చేసినప్పుడు మనస్సుకుండే శాంతి, ఒక అసత్కార్యంచేసినప్పుడు ఉండదు. ఎప్పుడూ పూర్వులు చెప్పినట్లుగా దైవానికి సూటిగా నడుస్తాము. అంతకన్నా మనశ్శాంతి ఏమిఉంటుంది? మనస్సును నిలవద్రొక్కుకునేందుకు అది మంచిమార్గం. అప్పుడు మోక్షం సుగమంకదా!

తన ధర్మం తాను చేయటంకంటె మనస్సుకి శాంతి భద్రతలు లేవు. ఇదిలేకుండా ఏమతమూ లేదు.

ఆ జమీందారుగారు యీప్రార్థనామతం పెట్టేడు. కాని, పెట్టేడుఅంటే ఆయన మతకర్తకాదు. అప్పటి కయ్యేది

పీలుగా ఆచరిస్తున్నాడు. ఆయన బ్రహ్మని తిమ్మి, తిమ్మిని బ్రహ్మ చేస్తాడు. ఎవరికిచేతనైనంతవరకు వారు యీామాంతం చేయలేనివాళ్లు లేరు. వేదమతాల్లోనూ యింతే; అవేద మతాల్లోనూ యింతే.

ఆరోజున ప్రార్థన జరుగుతోంది. అగ్రాసనాధిపత్యం వహించి ఒకాయన ఒక ప్రార్థన ఉ ప న్యా స ం వ లె చేస్తున్నాడు. అందరూ కన్నులు మూసికొని ఉన్నారు. పిల్లలకు పరీక్ష జరుగుతూంటే ఎంత నిశ్శబ్దంగా ఉంటుందో అంత నిశ్శబ్దంగా మందిరం ఉంది.

ఇంతలో కోటలోనుంచి పరుగులు పెట్టుచూ ఒక కాసాలతను వచ్చి అక్కడవున్న గుమాస్తాతో చెవిలో ఏదో రహస్యముగా ఊదేడు. గుమాస్తా పిల్లిఅడుగులతో దివాన్‌గారిని సమీపించి, నొక్కి, అది 'రిలే' చేశాడు. దివాన్ గారు, రాజాగారు నడుమ నొకసారి కన్నులు తెరిస్తే ఏదో చెప్పవలసినట్లుగా కనులుపెట్టేడు.

ఆయన ఏమిటని కళ్ళతోనే అడిగేడు. ఈయన ఊదేడు.

ఇద్దరూ నెమ్మదిగా లేచి బయటకు వచ్చారు. వీరు వెళుతున్నారని లీలగా అందరికీ తెలిసింది. అందరూ అర తెరపుడు కళ్ళతో చూస్తూనే వున్నారు. ప్రార్థన సాగు తూనే ఉంది.

దొరగారు మోటారుమీాద కోటకు వెళ్లేరు. కోటల్లో పరిచారకులందరూ గ గ్గో లు గా అటూాయిటూా తిరుగు తున్నారు. తెలిసినవార్తనే దొరగారు మొదట కనిపించిన

సేవకుణ్ణి అడిగేరు. 'మళ్ళీ అమ్మగారు విరచుకొని పడిపోయి నారంకీ!' అన్నాడు.

రాజాగారు అంతఃపురములోకి వెళ్ళేరు. రాణీగారు మంచంమీద పడుకుని ఉన్నది. నోటివెంట నురుసులు క్రక్కు తున్నది. కన్నులు తేలవేస్తూన్నది. డాక్టరుగారు ప్రక్కనే ఉన్నారు. రాజాగారు ఎట్లా వున్నది? అన్నారు. డాక్టరు గారు సమాధానం చెప్పేరు. ఎప్పటికిమల్లేనే యుంది. పల్సు బీటు, హార్టుబీటు నిమిషానికి రెండువందలు దాటుతోంది.

రాజా:- ఇంజక్షను యివ్వకపోయినారా?

డాక్టరు:- యిచ్చాను; కొంచెం తగ్గింది; కాని ఉద్ధృతం అలాగే వుంది.

రాజా:- ఎంతసేపైంది?

డాక్టరు:- నేను వచ్చి పదిహేను నిమిషాలైంది.

రాజా:- (దాసీవాళ్ళవంక చూచి) అంతకుపూర్వము?

ఒకదాసి:- ఐదు నిమిషాలు.

అందరూ ఆపాటునే నిలుచుండి ఉన్నారు. రాజాగారి తల్లి ప్రక్కనే కుర్చీమీద పడుస్తూ కూర్చొనిఉన్నది. ఆమె చివరకు యిలాఅన్నది. బాబూ! నామాట వినవూ? ఇది తిరుపతివెంకటేశ్వరుల మహాత్యం. నీకు తెలుసు. స్వామీ! కొండకు వస్తాము; నిలువుదోపిడి యిస్తాము. తలవెంట్రుకలు తీయిస్తాము; ప్రతి శనివారముఉంటాము; అని మొక్కుకో మంటే మొక్కవు. నేనూ, నీ భార్యా ఎన్ని ముడుపులు కడితే ఏమిలాభం? నిన్న శనివారం పాడుచేసింది. నీకు యిష్టంలేదట. వారికి ఇష్టంలేని పని నేను చెయ్యటం ఎందు

కని నిన్న తలారా స్నానంచెయ్యలేదు. దీపారాధన చెయ్యలేదు. కొబ్బరికాయ కొట్టలేదు. ఏకభుక్తం చెయ్యలేదు. ఇదిగో యివ్వాళ మళ్ళీ యిలాగువచ్చింది.

రాజా:- రాత్రి ప్రార్థన చేసిందా?

ఒకదాసి:- అమ్మగారు రాత్రి ప్రార్థనచేశారు. ఇవ్వాళ ప్రొద్దున్నా ప్రార్థనచేశారు.

తరువాత జమీందారుగారు కొంతసేపు మాటాడలేదు. డాక్టరుగారు మళ్లీ పరీక్షచేశాడు. తరువాత జమీందారుగారిని బయటకు రమ్మని తీసికొనివెళ్ళి యిట్లాచెప్పేడు. స్థితి అంతకన్న అంతకు చెడుతోంది. మళ్ళీ యింజక్షను యివ్వమంటారా?'

మళ్లీ యింజక్షను ఇచ్చాడు. అరగంట గడిచింది. మళ్లీ స్థితి చెడుతోందని డాక్టరుగారు చెప్పేరు. చెప్పి అన్నాడుకదా 'అవునో, కాదో తమరు కొండకు వస్తామని మ్రొక్కుకోండి. దీనివల్ల నష్టమేమున్నది? ఎల్లాగయితేనేమి దొరసానిగారు సుఖంగా వుండటం కదా! మనకు కావలసినది? మ్రొక్కుకున్నంతమాత్రాన మీ సిద్ధాంతానికి భంగమేలా ఉన్నది? అని.

రాజాగారన్నారు. 'ఔనండీ! ఆ దేవుడు దేవుడైతే నన్నేదైనా చేయమనండి! ఆవిడమీదికి పోవడం ఎందుకు' అని.

డాక్టరుగారు అన్నారు-అయ్యా! మీకు వస్తే మీ బాధ యింత ఉండదు. రాణీగారికి వస్తే మీబాధ ఎక్కువ.

జమీందారుగారు నవ్వేరు. సరేనని లోపలకు వెళ్ళి బలవంతమూర్ఖలంగా చేస్తున్న దానికిమల్లే తల్లిగారితో చెప్పేరు 'కానివ్వండి అమ్మగారు' అని.

ఆవిడ వెంటనే లేచి కోడలు మెళ్లో రత్నాలపతకం తీసి, ఒక చిన్న తెల్లనిగుడ్డ పసుపునీళ్ళల్లో తడిపి, మూటకట్టి యిలా అన్నది. స్వామీ! మాకోడలు నీశనివారాలు యింక భంగం చేయదు. నీకొండకు తప్పక వస్తాము; ముడుపు ఇస్తాం; మాకోడలు వెంటనే లేచి సరిగా ఉండాలి అని.

ఐదునిముషాలు గడిచింది. రాణీగారు లేవలేదు. పెద్దరాణీగారు అన్నది బాబూ! నేనంటే చాలదు. నీవు అనాలి అని

రాజాగారు మొగము చిన్నపుచ్చుకుని ఆమాటలే అన్నాడు.

డాక్టరుగారు మళ్ళీ పరీక్షచేశాడు. మొగం తెప్పరిల్లింది. తరువాత రెండు నిమిషాల్లో రాణీగారు లేచి కూచుంది.

## 3

నీలకంఠశాస్త్రి మతం వేరు. జమీందారుగారి మతం వేరు. బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకున్నట్లుగా యీ రెండు మతాలవారికి పొరుపులేదు.

దొరగారి మతము ఉపనిషన్మతము. వాళ్లు ఉపనిషత్తులలో జ్ఞానభాగం అంతా ఒప్పుకుంటారు. అందులో చాలా మందికి ఉపనిషత్తులలో రెండు భాగాలుంటాయని అందులో ఒకభాగం ఉపాసనాభాగం అని, రెండోది జ్ఞానభాగ మని

తెలియనే తెలియదు. ఉపాసనాభాగం ఒప్పుకుంటే వాళ్ళ మతమే చెడిపోతుంది. ఉపాసనాభాగంలో కేవల బ్రహ్మ కాదుగదా!

ఇది వట్టి కేవల బ్రహ్మమతం. అందులోకూడా సహస్రారచక్రం, అజ్ఞానచక్రం, అనాహతం మొదలైన పద్ధతులు లేవు. వట్టి బ్రహ్మ పృథివ్యా ద్యావరణాలున్నై. అవి అవిగానే ఉంటై. ప్రార్థనచేస్తే బ్రహ్మ వచ్చేస్తాడు.

కామక్రోధాలకేమీ లోపంలేవు. వీళ్లు మనమతానికి చెందినవాళ్ళు, వీళ్లు మనమతంవాళ్ళుకాదు అనే భేదబుద్ధి అక్కడ చూచి ఇంకోచోట చూడాలి. ఆ మతంలో కొన్ని భేదాలు. ఇప్పుడందరూ వాళ్ళమతస్థులే. పూర్వం వీడు బ్రాహ్మణుడు, వాడు తక్కువ. పూర్వం వాడు బ్రాహ్మణేతరుడు, అది ఎక్కువ.

ఒక్కొక్కప్పుడు ఇంకో చమత్కారంఉంది. వాడు మనమతం కాకపోయినాసరే, వాడు బ్రాహ్మణుడు కాకపోతే సరి. ఈ రీతిగా ఉంటుంది పక్షపాతం! సృష్టి అంతా బ్రహ్మమయం.

వాళ్ళకి పురాణాలు, శాస్త్రాలు, వేదాలు ఇవి ఏవీ పనికిరావు. కాదయ్యా యితరమతాలు పనికివస్తాయా? అంటే ఒక సనాతనమతం తప్ప తక్కినవన్నీ పనికివస్తై. అంత గౌరవించరుగాని, మహమ్మదు ప్రవక్తగురించి గొప్పగా చెప్పుకుంటారు.

జమీందారీ ఊరంటే చమత్కారంగా ఉంటుంది. జమీందారీ ఊరంటే జమీందారు కోట కట్టిన ఊరు.

జమీందారీ శిస్తు చెల్లుబడిఅయ్యే అన్నిఊళ్ళు కాదు. ఆ జమీందారీఊళ్ళో ప్రతి అంగుళంమేర జమీందారుగారిదే. ఆ ఊళ్ళో ఇళ్ళన్నీ జమీందారుగారివే. నివేశనస్థలాలన్నీ జమీందారుగారివే.

ఒక్కొక్కప్పుడు ఊళ్ళో సగానికిసగం జనం జమీందారుగారి ఉద్యోగస్తులు. వాళ్ళ సంసారాలు, వాళ్ళ సుఖదుఃఖాలు బాధ్యతా బాధ్యతలు అన్నీ జమీందారుగారికే కనుక, అందులో జమీందారుగారిమాట ఎవడుగాని దాటి పోగలడు ?

అంచేత ఆ ఊళ్లో కొంతమంది అనగాఓ వందరూపాయలు దాటిన ఉద్యోగస్తులు - దాటకపోయినా - అనేక మోస్తరు గౌరవంగల ఉద్యోగస్తులు - వీళ్ళందరూ జమీందారుగారి మతమే. ఈసంఖ్య పాతిక, ముఫ్ఫైకన్న ఎక్కువ ఉండదు.

ఆ ఊళ్లో పదియిళ్లు పైదీకులవీ ఉన్నవి. ఈ పదియిళ్ళ వాళ్ళూ ఒకటేకుదురు. ఐదారు తరాలనుండీ యీజమీందారుల నాశ్రయించుకొని ఉన్నవాళ్ళు. ఇంకా మాట్లాడితే ఇంకా పూర్వంనుంచీను.

ఈ జమీందారుల వంశచరిత్ర చూస్తే గోలుకొండ నవాబులనాటినుండి ఉన్నవాళ్ళని తెలుస్తుంది. వీళ్ళపూరుడు నవాబుగారి దయ సంపాదిద్దామని, గోలుకొండ వెళ్ళేడట. ఈయన వట్టి సరదారు. ఆయనకున్న సంపత్తి అంతా గుఱ్ఱమూ కత్తీ. నవాబుగారి దర్శనం ఎలా ఔతుంది?

ఆ నవాబుగారికి ఓ పెద్దజాగీర్దారుగారి అంతఃపురంలో పరిచయంఉంది. ఓరోజు రాత్రి నవాబుగారు అంతఃపురం లోకి గుఱ్ఱంఎక్కి వెళ్లుతున్నారు. వెళ్ళుతూ ద్వారందగ్గర కాపలా ఎవరిని ఉంచాలి!

ఇంతలో ఈపూర్వుడు కనపడ్డాడు. ఈయనను పిలచి 'లోపల కెవరినీ రానీయవద్దు' అని చెప్పి వెళ్లేరు.

కొంత సేపటికి ఆ జాగీర్దారు వచ్చాడు. ఈయనను లోపలకు పోనివ్వడు. వివాదం జరిగింది. నాయింట్లోకి పోనివ్వకపోవటానికి నీవెవ్వరవురా? అన్నాడు. ఈ పూర్వుడు ఆ జాగీర్దారుని కత్తి పెట్టి నరికేడు. నరికితే రాతుకి రాతు గుఱ్ఱానికి గుఱ్ఱం రెండు రెళ్ళు నాలుగు తుండెములైనారు.

కొంత సేపటికి నవాబుగారు వచ్చారు; చూచారు; అతని బల, పరాక్రమాలకు సంతోషించారు. ఈ పరగణా అంతా ఆయనకిచ్చారు. అల్లా వచ్చిన జమీందారీ!

బ్రిటిషురాజ్యం వచ్చేవరకూ ఆపూర్వులందరూ ఇంత బలశాలులూ ఇంత పరాక్రమవంతులూ. బ్రిటిషువారు వచ్చిన తరువాత కత్తికీ వారికీ సంబంధం లేకపోయింది.

దీనికితోడు శిస్తులు బకాయిలూ రాజ్యం దొరతనం వారు ఎక్కడికక్కడికి చెల్లుకట్టుకుంటూ వచ్చారు. చివరకు పాతికవేల జమీందారీఅయింది. దానిని ఇప్పటి ఆయన తాతగారు ఒకలక్ష జమీందారీ చేశాడు.

ఆ ఊళ్లో పురోహితులకు ఈజమీందారుకి ఒక్క తెంచ రాని సంబంధం ఉంది.

బ్రిటిషువారు క్రొత్తగా ఈదేశం సంపాయించిన రోజులలో ఈదేశంలో పరిపాలన సగం సాలెనేత సగం మాలనేతగా ఉండేది. జమీందార్లు స్వతంత్రప్రభువులల్లే ఉండేవాళ్లు. అలా వ్యవహరించేవాళ్ళు. ఏ ఎగుడు దిగుడో చూచి బ్రిటిషువారు వీళ్ళని సోదెలోకికూడా రాకుండా చేసే వాళ్ళు. ఒకపరగణాలో రెండు జమీందారీలు ఉంటేవాళ్ళకి వీళ్ళకి బద్ధవైరంగా ఉండేది. అట్లా యీ జమీందారీకి ఇంకో ప్రక్క జమీందారీకి పచ్చగడ్డివేస్తే భగ్గుమనేది.

ఆ ప్రక్కజమీందారు ఐదారు తరాలక్రిందట వీళ్ళ కోటమీదికి దాడివచ్చాడు; కోట ముట్టడిచేశాడు; కోటలో ఉన్న అందరినీ నరికేడు; ఆ సమయంలో ఆయన పురోహితుడు మూడేండ్లు యీడుగల ఆ జమీందారు కొడుకును దాచివేసి తనకొడుకే నన్నాడు. అల్లా వాళ్ళవంశం నిలిచింది.

తరువాత బ్రిటిష్‌వారి సైన్యాలు వచ్చినై. ఆ పొరుగు జమీందారుని శిక్షించినవి. వాళ్ళ జమీ అంతా బ్రిటిష్ పరిపాలనలోకి వెళ్ళిపోయింది.

ఈ పురోహితులు ఈ కుఱ్ఱవాణ్ణి తీసుకువెళ్ళి ఈ కుఱ్ఱ వాడు జమీందారుకొడుకని ఋజువుచేసి ఏదో తంటాలుపడి; దొరలను పట్టుకొని ఆకుఱ్ఱవానిరాజ్యం ఆకుఱ్ఱవానికిప్పించారు. ఆకుఱ్ఱవాడు పెద్దవాడైనాడు. ఆబ్రాహ్మణ్ణి తాతగారు అని పిలిచేవాడు. తండ్రికన్న ఎక్కువగా చూచేవాడు. ఆకోటలో అప్పటినుంచి ఒక నియమం. కోటలో ఏ శుభకార్యమైనా ఆ పురోహితుని వంశంలో పెద్దవాణ్ణి పూజించాలి. వివాహమైతే పురోహితునకు రెండువేల రూపాయిలు కట్నేము. ఇల్లా

శుభమో అశుభమో దీనికింత దీనికింత అని నియామకంగా ఈ పురోహితుని కుటుంబానికి వచ్చే కట్నాలు. ఆ జమీం దారు నియామకంచేసి పోయినాడు.

తరువాత వచ్చిన జమీందారులందరూ యీ పురోహి తుల కుటుంబాలు అంటే, అమిత గౌరవంగా, అంత్య మర్యా దగా ఉంటున్నారు. ఆ కుటుంబం యిప్పుడు పది ఇళ్ళు అయింది. ఈ కట్నాలు పది కుటుంబాలవాళ్ళు పంచు కుంటారు. అదే వాళ్ళ జీవనం.

ఈ జమీందారుగారి మతం పుచ్చుకొని, తక్కిన వాళ్ళందరూ మతం పుచ్చుకోలేదన్న మాటేగానీ విశ్వా సాలు, ఆచారాలు రాజుగారిమతం ప్రకారమే ఉంటున్నవి.

ఇల్లా ఉండగా ఈ జమీందారుగారి తండ్రిగారి హయాంలో ఒక చిక్కు వచ్చింది. ఈయనతాతగారికి ఆరుగురు భార్యలు. పెద్దావిడకు సంతానం లేదు. రెండో ఆమెకు ఒక కొడుకు. నాల్గవ ఆవిడకు మగసంతానం లేదు. ఆడ సంతానం. ఐదవ, ఆరవ భార్యలకు ఇద్దరు, ముగ్గురు మగ పిల్ల లున్నారు. వీళ్ళందరిలో రెండవఆమెకొడుకు వయస్సు చేత పెద్దవాడు కాని రెండవ ఆవిడ కులం వేరు. ఆవిడ వీళ్ళ మతంలోది కాదు. దానితో రాజ్యం ఐదవ ఆవిడ కొడుకుల్లో పెద్దవాడికి రావాలన్నారు.

వ్యాజ్యాలు. కోటలో ఉన్న కాగితాలు మొదలైనవి ఈ పార్టీలలో ఎవళ్ళ కందినవి వాళ్ళు చిక్కించుకున్నారు. కొందరు రెండవఆమె కొడుకు పక్షం. కోటలో పదిపదకొండు.

లక్షల ఖరీదు చేసే జవాహిరీ, పదిలక్షల వెండి, బంగారం ఉంది. ఇది ఎవరిచేతికందితే వాళ్ళు దక్కించుకున్నారు.

ఈ పదికుటుంబాల పౌరోతులలో ఒక ఆయన పేరు రామశాస్త్రిలు. ఆయన కొంత పురోహితుడు, కొంత దివాను. కొన్ని అవసరమైన కాగితాలు బయటపెడితే రాజ్యం రెండవఆమెకొడులకు రాదు. అయిదవ ఆమె కొడుకే వస్తుంది.

ఆపార్టీవారు ఈ రామశాస్త్రికి ఆకాగితాలు వాళ్ళ పరంచేస్తే బేరం నలభైవేలదాకా పెంచారు. రామశాస్త్రి యివ్వలేదు. రెండవఆమెకొడుకునే జమీందారును చెయ్యాలని కూచున్నాడు. చివరకు రాజ్యం ఆయనకే వచ్చింది.

అప్పటినుంచీ ఆజమీందారునకు రామశాస్త్రిఅంటే అభిమానం. రామశాస్త్రి ఆకాగితాలు తగలనూపెట్టలేదు; రాజగారికివ్వనూలేదు; రాజుగారు అడగలేదు. రామశాస్త్రి బతికిఉన్నన్నాళ్ళు కోటలో సర్వాధికారిగా ఉన్నాడు. ఉన్నాడుకాని రాజుగారిని ఏమీ మోసం చేయలేదు.

చివరి కాయన చచ్చిపోయేటప్పుడు అపర క్రియకు పెట్టె తీసి చూస్తే మూడురూపాయల పన్నెండణాలకాని ఉన్నది.

రామశాస్త్రికొడుకుపేరు సోమేశ్వరం. అతడు సంసారం సాగించటం కష్టమయింది. ఈ సోమేశ్వరం బి. యే. దాకా చదివేడు. తండ్రి పోవటంతోటే చదువుమానేశాడు.

ఇప్పటి జమీందారుగారిహయాం వచ్చింది. ఈయన సోమేశ్వరానికి ఒక పాతికరూపాయలఉద్యోగం యిచ్చాడు.

దొరగారి మతంలో నిజానికి ఆధ్యాత్మిక ఛాయలు ఏమీ లేవు. కొన్ని నైతికఛాయలు మాత్రం ఉన్నవి. ఆ మతంయొక్క నిజమైనస్వరూపం సంఘసంస్కారం.

దొరగారు సోమేశ్వరాన్ని ఒక హరిజనబాలికను వివాహంచేసుకోమన్నారు. సోమేశ్వరం తల్లి బ్రతికిఉంది. సోమేశ్వరం తల్లిమాటకు అడుగుదాటడు. ఆవిడ అంగీకరిస్తుందా!

దొరగారు కనీసం విధవా వివాహమైనా చేసుకోమన్నాడు. దానికి సోమేశ్వరంతల్లి మాట్లాడలేదు.

ఇలా ఉండగా దొరగారికి తెలియకుండా సోమేశ్వరం పెళ్ళిఐంది. సోమేశ్వరం ఇరవైనాలుగు ఇరవై అయిదేండ్లవాడు. పదేండ్లు వచ్చినయ్యో రాలేదో అలాంటి పిల్లను తెచ్చి సోమేశ్వరానికి పెళ్ళిచేసింది వాళ్ళమ్మ.

ఈసంగతి రాజాగారికి తెలిసింది. చివరకు రజస్వలానంతర వివాహమైనా చేసుకోలేదు అని దొరగారికి కోపం వచ్చింది. అప్పటినుంచీ సోమేశ్వ రంకోటలోకి రావటానికి మన్నా!

ఇతగాడికి తిండిలేదు. ఇల్లుమాత్రం స్వంతం. పూర్వపుజమీందారు రామశాస్త్రికి వ్రాసియిచ్చాడు.

ఈ సోమేశ్వరం ఊరు వదలి ఎక్కడో ఎక్కడో చిన్నచిన్న ఉద్యోగాలు చేస్తూ బ్రతకటం దుర్ఘటంగా ఉంటున్నాడు. సోమేశ్వరానికి ముగ్గురు అప్పగార్లు; ఇద్దరు చెల్లెళ్ళు.

ఈ చెల్లెళ్ళకు వివాహం కావాలి. ఆ అప్పగార్లకు తట్టెడంత సంతానం. ఆ మేనకోడళ్ళకు వివాహంచేసే బాధ్యతా యితనిదే. వాళ్ళు వట్టిదరిద్రులు. సోమేశ్వరం సంసారం ముజ్జిడ్డు.

కాని, రామశాస్త్రిదగ్గర వ్యతిరేకంగా ఉండే జమీందారుగారి కాగితాలు ఉన్నై. ఆ కాగితాలు తమకిస్తే ముప్పైవేలు ఇస్తామని సోమేశ్వరంతో బేరంపెట్టేడు.

౪

సోమేశ్వరం కథ నానాటికి తీసికట్టుగావుంది. అతని భార్య కాపరానికి వచ్చింది. ఇంట్లో ఎప్పుడూ పదిమంది తక్కువ లేకుండా ఉంటారు. ఏపూటపడితే ఆపూట గడవటం కష్టంగా ఉంటోంది. వచ్చినబంధువులకు వీళ్ళేమి కష్టపడుతున్నారో అన్న విచారం లేదు. రామశాస్త్రి గొప్పగా బ్రతికినవాడు గనుక, ఆరోజుల్లో జమీందారే ఆయన, ఆయనే జమీందారుగా ఉండేవాళ్ళు గనుక, ఆనాటి పలుకుబడి, మర్యాదా ఊళ్లో అచ్చంగా పోలేదుకాబట్టి, తోడుగు యెల్లాగోఅల్లా లాక్కువస్తున్నాడు. సోమేశ్వరానికి తొమ్మిదేండ్లు వెళ్ళి పదోయేడు వచ్చిన చెల్లెలు వుంది. ఆఅమ్మాయి పేరు నిరంజని. ఈ పిల్ల మరీ పసిపిల్లగా వుండేటప్పుడు తండ్రితో కోటలోకి పోవటం; జమీందారుగారి తొడమీద కూచోటం రోజూ కోటలోంచి ఎవ్వో బహుమతులు తెచ్చుకోటం. రామశాస్త్రి పోయి నాలుగేళ్ళయింది. సోమేశ్వరానికి రాజుగారికి చెడిపోయి రెండేండ్లయింది. ఈ రెండేళ్ళ

క్రిందటివరకు నిరంజని కోటలోకి వెళ్ళటం, రావటం వున్నది. ఈ రెండేళ్ళనుంచి పూర్వమంతా లేకపోయినా నిరంజని అంతఃపురంలోకి వెళ్ళుతుంది వస్తుంది. ఇంట్లో మరీ యిబ్బందిగా వుంటే నిరంజని బిక్కమొగం చూచి రాణీగా రడుగుతుంది. నిరంజని చెపుతుంది. రాణీగారు చాటుగా ఏదో యిస్తుంది. ఒకరోజు రెండురోజు లోకమోస్తరుగాగడుస్తుంది.

ఈ నిరంజని నాలుగైదేండ్లనుండి పెద్దరాణికి, చిన్నరాణికి ప్రేమాస్పదురాలయింది. తిరుపతి వెంకటేశ్వర్ల పూనకం నిరంజనికి వస్తుంది. ఆ అమ్మాయి యేవో, యేవో చెపుతుంది. అత్తాకోడళ్ళిద్దరూ తలపట్లు పట్టుకుంటారు. ఒక రోజున నిరంజనికి పూనకం వచ్చి యిలా చెప్పింది. 'గోపాలం ప్రార్థనామందిరంలో ఏమన్నాడో తెలుసా—వెంకటేశ్వర్లు గింకటేశ్వర్లూ హూహూ అని విరుచుకపడతారు. ఇదంతా ఒక నాటకం అని నన్ను తిట్టేడు' అంది. నన్ను అంటే తిరుపతి వెంకటేశ్వరస్వామిని అనీ, గోపాలం అంటే జమీందారు. ఆయన పూర్తిపేరు గోపాల వెంకటకృష్ణ రామారావు బహద్దర్. నిరంజనికి యెప్పుడు పూనకం వచ్చినా జమీందారును గోపాలం అంటుంది. వట్టిఅప్పుడు దొరగారు అంటుంది, రాజాగా రంటుంది. చాలమంది ఆ పిల్ల నడుగుతారు; రాజాగారి పేరేమిటని. ఆపిల్ల తనకు తెలియదంటుంది. తెలిసి చెప్పదని కొందరంటారు. ఆరోజున సాయంత్రం చిన్నరాణీగారు భర్తనడిగింది. 'మీరు ప్రార్థనామందిరంలో యివ్వాళ తిరుపతి వెంకటేశ్వరస్వామిని తిరస్కరించి మాట్లాడారా?' అని. ఆయనకు భయంవేసింది.

ఈసంగతి ఎవరు చెప్పారా? అని. ఇది మళ్ళీ విరచుకపడటం ప్రాణంమీదికి రావటం జరుగుతుందేమోనని భయపడి యిలా అన్నాడు. 'అబ్బే ఏదోమాటధోరణిలో అన్నాను.' అక్కడా అలా అనకపోతే బాగుండదు. స్వామి దేవుడు కాదని నేననలేదు. ఆయన మొక్కు చెల్లించకుండా ఉంటే కదా? అని, నీ కెవరు చెప్పారు? అని అడిగేడు. రాణి యీ ప్రసంగం ప్రార్థనామందిరంలో యెప్పుడు జరిగింది? అని అడిగింది.

ఆనాటి ఉదయం తొమ్మిదీ ఆప్రాంతాల్లో.

రాణి యిట్లా అంది, 'నేను బ్రతకాలని మీకువుంటే మీరు స్వామినిగురించి యెప్పుడూ యిలా అనని ఒట్టు వేసుకోండి.'

రాజు:- నీకెవరు చెప్పారో చెప్పమని బలవంతం చేశాడు. రాణీగారు తటాపటాయించి నిరంజనానికి పూనకం వచ్చి చెప్పింది అన్నది.

రాజుగారు:- అది మనకోటలోకి రావటం ఎందుకు? నేను వాళ్ళఅన్నని కోటలోకి రావద్దు అన్నాను. వద్దంటే వస్తారు. వాళ్ళకు సిగ్గయినాలేదు. ఆ సోమేశ్వరానికి ప్రభు భక్తి లేదు. వాడిచెల్లెలు యిక్కడికి రావటం ఎందుకు? అని విసరుకొని, ఎవళ్ళో చెపితే విన్నదికాబోలు, యిక్కడికి వచ్చి పూనకం మల్లే నటించింది అన్నాడు.

రాణీగారన్నది కనా: ఆపిల్ల యిక్కడకు ఎనిమిది గంటలకు వచ్చి పదిగంటలకు వెళ్ళినది. అంతసేపూ నాదగ్గరే వుంది. ఎవళ్ళు చెపితే విన్నది? అని.

రాజుగారు తటపటాయించారు. అవుననటానికి వీలు లేదు. కాదంటానికీ వీలులేదు. ఇట్లా ఇదివరకు రెండుమూడు సార్లు నిరంజనికి పూనకాలురావటం జరిగిందిగాని; యీసారి నిరంజని మీద రాజుగారికి వచ్చినంతకోపం యిదివర కెప్పుడు రాలేదు.

ఇల్లా వుండగా నిరంజనికి రజస్వలానంతర వివాహం చెయ్యాలని రాజాగారు సోమేశ్వరంతో పూర్వమే చెప్పాడు తాను తొమ్మిదేండ్లపిల్లను చేసుకున్నా, చెల్లెలికైనాసంఘ సంస్కారం వివాహం చేస్తాడేమోనని రాజాగారికి ఆశ. చేస్తే సోమేశ్వరంమీద కోపం కొంత తగ్గవచ్చు. సోమేశ్వరం నానాకష్టాలూ పడుతున్నాడు. రాజుగారికోపం తగ్గకపోతే అతనికి బ్రతకటానికే వీల్లేదు. కనుక చెల్లెలికి సంఘసంస్కార వివాహం చేసితీరుతాడని రాజుగారి ఊహ.

ఒక నెలా రెండునెలలు గడచిన తరువాత నిరంజని వివాహం అని చెప్పుకున్నారు. ఆమాట వినటంతోనే రాజు గారు ఉగ్రుడైపోయినారు. రాజుగారికి ఉగ్రత అంటే మని షిని చూస్తే ఊరుకున్నట్టు ఉండదు. కుమ్మిపెట్టినట్లుంటుంది, అంటే ఊరంటుకోదనికాదు జ్వాలలులేకుండా కుములుతుంది. యెప్పుడైతే నిరంజనికి వివాహం అని తెలిసిందో 'ఛీ! యింక వాళ్ళప్రసక్తి నాకక్కరలేదన్నా, జమీందారుగారు అక్కరలేకుండా ఊరుకున్నారా ! రహస్యంగా కాసా వాళ్ళని కనుక్కున్నాడు ఎవరికిస్తున్నారా అని. ఒక రెండవ పెళ్ళివానికి ముప్పైఏళ్ళు దాటినవానికి, అతనికి చదువూ సంధ్యా ఏమీలేదు. ఒక పల్లెటూరివాడు, ఒక యిల్లువుంది.

ఎనిమిది యెకరాల మాగాణివుంది. మొదటి సంబంధాని కొక కొడుకు వున్నాడు. ఉభయఖర్చులు అతనే పెట్టుకుని పెళ్లి చేసుకుంటున్నాడు. మొదటిభార్యా నగలున్నై ఏడెనిమిది వందల రూపాయలవి. ఓ పట్టుచీర, రెండు దాపుడుచీరలు వున్నవి. దొరగారన్నాడుకదా 'ఏదో ఒకటి చేస్తున్నారు. చదువుకున్నవాడికైనా యివ్వడంలేదేమి? ఆస్తి లేకపోతే మానే' అన్నాడు. కాసావా డన్నాడు. 'ఏమిచేస్తారండీ! తినటానికే యిబ్బందిపడుతున్నాడు. కట్నాలిస్తేనేగాని సంబంధాలు రావాయె' అని ఏదో శిఫార్సుగా అన్నాడు.

రాజాగారి ప్రకృతి చాల విచిత్రమైనది. ఆయన మనస్సు యెప్పుడో మెత్తపడుతుంది. మనుష్యుడైన తరువాత మనస్సు మెత్తపడకుండా ఉంటుందా యెప్పుడో ఒకప్పుడు. మరీ రాక్షసుడు అనుకోండి. శృంగారవిషయంలోనైనా మెత్తపడుతుంది; అంతకన్న కొంచెం మెరుగైతే మరికొన్నియితర విషయాల్లో కూడా మెత్తపడవచ్చు. ఈ ఆర్ద్రిత మనుష్యులెంతమంది వున్నారో యీ సృష్టిలో పరిస్థితు లెన్ని ఉన్నాయో, అన్ని రకాల భేదాలు కలది. ఒక్కొక్క రకానికి ఆ ఆర్ద్రితయొక్క పలుచన, చిక్కన పట్టి మళ్ళీ చాలా భేదాలుంటాయి. ఈ ఆర్ద్రిత వెంటనే యెండిపోయి మళ్ళీ పలచపడటంకూడా ఉంటుంది. ఇది మళ్ళీ వ్యాక్రియారూపం. పొందటంలోకూడా భేదాలుంటై. అందులో దేశ, కాలాలు ఉంటవి. అనంతస్వరూపమైన ఆర్ద్రితలో రాజాగారి ఆర్ద్రిత యొక్క వైలక్షణ్యం లేదు.

ఆయనయొక్క ఆర్ద్రిత యెట్టిది ? అంటే ధర్మా మీటరుపెట్టి జ్వరాన్ని కొలుస్తామనుకోండి. నూటైదు దాటితే విపరీతమైన జ్వరమన్నమాట. నార్మల్ పాయింటు కొంచెం దాటితే జ్వరం ఊరికే తగిలినట్లు. ఆయన ఆర్ద్రిత కూడా అల్లాంటిదే. ఆర్ద్రితో తగులుతుంది. ఎవనితోనూ వాచా వ్యక్తంకాదు. క్రియారూపానికి దానికీ సంబంధంలేదు. ఈ ఆర్ద్రితకూడా, వెంటనే యెప్పుడూ నూటైదు డిగ్రీలు మించి వచ్చేకోపం అనే జ్వరం వుందికాదూ. దాని ధాకకు ఆగలేక అణిగి మణిగి వుంటుంది. వెంటనే యెప్పటికిమల్లేనే బిలో నార్మల్ కొతుంది. అందుచేత రాజాగారు మాట్లాడ కుండా వెళ్ళిపోయినారు.

నిరంజని వివాహంఅయింది. అది అత్తవారింట్లోనే అయింది. అత్తవారు నిరంజనిని రెండుమూడు నెలలు ఉంచు కుని పంపిస్తామన్నారు. అత్తవారంటే యెవరు? భర్త ఒక్కడే! అతనితల్లి ముసలిది. కూర్చుంటే లేవలేదు. లేస్తే కూచోలేదు. ఇన్నాళ్ళూ అతనే చెయ్యి కాల్చుకున్నాడు. ఇప్పుడే కరివేపమొక్క ఒకటి వచ్చిందిగా; రెండునెలలు కొంచెం అభ్యాసం యిద్దామనుకున్నాడు.

ఈ వివాహంతో రాజాగారికి, తనకూ పొసగుతుం దేమోనన్న ఆశా లేశంకూడా సోమేశ్వరానికివదలిపోయింది. ఉభయ ఖర్చులు బావమరదే పెట్టుకోటం అని యెంత అను కున్నా సోమేశ్వరంచేతికి రెండుమూడువందలు తగిలినై. ఈ మూడువందలూ, యిదివరకున్నది – ఊళ్లో షాహుకారు యిల్లు తాకట్టుపెట్టమన్నాడు. తిండికే యిబ్బందిపడ్డా తల

దాచుకునేందుకు కొంప కా_స్తవున్నది. ఈ తాకట్టు ఆ కొంప కూడా వదిలేందుకు పునాదివేసినట్లుంది.

నిరంజని రెండునెల్లల్లా నాలుగునెలలై పుట్టింటికి వచ్చింది. నిరంజని ఉన్నప్పుడు అడపా దడపా రాణీగారు; ఏమైనా పంపిస్తూవుండేది. నిరంజని మూలంగా ఆ కొంచెము లేకపోయింది. పెళ్ళి లేకపోవటం పేరుపెట్టుకొని చుట్టాలు కొంపనిండా సమృద్ధిగా శేవిణీచేసారు. ఇందులోఒకటిమెరుగు తాకట్టు పెట్టించుకున్న షావుకారు చిల్లరఅప్పులు మరి కొన్నాళ్ళదాకా యేవిఅడిగి తేలవి యిస్తాడు.బంధువులందరూ వెళ్ళిపోయేటప్పటికి నెలపై న అయింది. ఆనాటికి సోమేశ్వరం తనస్థితి చూచుకుంటే శ్మశానంలో కూచున్నట్టు ఉంది. ఇంట్లో రెండురోజులు.

ఆరోజున ప్రొద్దున సోమేశ్వరంఅరుగుమీదకూచొని వున్నాడు; జమీందారుగారి వారసులలోపెద్దాయన (ఆయన ఎప్పుడూ కదలి యెక్కడికి పోడు) ఆయన సోమేశ్వరంగారి యింటికి వెళ్తున్నాడు. ఇది నీలకంఠశాస్త్రి చూచాడు. రాజాగారితో చెప్పేడు. సోమేశ్వరం యింటిదగ్గర యేమి జరుగుతుందో కనుక్కోటానికి పొరుగింటిఆయన్ను పంపించారు.

వారసుదారు సోమేశ్వరాన్ని ఏదోచూచి మాట లాడేడు. జమీందారీ లేదుకాని, పోకిళ్ళు ఆయనదగ్గర ఏమి తక్కువ? ఆయనకు బుచ్చిబాబు అని బుచ్చిదొర అని యిలాంటి కొన్ని పేర్లు ఉన్నై. సోమేశ్వరం చినిగిపోయి, కూచోటానికికూడా అసహ్యంగావున్న ఒక చాప తెచ్చి వేసి

బుచ్చిదొరగారిని కూచోమన్నాడు. దొరగారు కూచున్నారు. ఇలా దయచేశారేమన్నాడు సోమేశ్వరం.

దొరగారు 'ఏమీలేదు, మీరు మీచెల్లెలికి వివాహం చేశారట; చూచి పోదామని వచ్చా' నన్నారు. అని పిల్లకేద్తైనా చేయించిపెట్టండని ఒక పాతికరూపాయలు చేతిలో పెట్టవచ్చాడు.

ఆసమయంలోనే పొరుగింటిఆయన చక్కావచ్చాడు.

సోమేశ్వరం యిలా అన్నాడు, 'బుచ్చిబాబుగారూ, నా కివాళ ఈ పాతిక రూపాయలు పాతికవేల ఖరీదు చేస్తై. కాని నన్ను క్షమించండి. నేను తీసుకోను. తీసికొంటె నా తండ్రికి ద్రోహంచేసినవాణ్ణి ఔతాను. ఆ దొర నిన్ను వదలిపెట్టేదుకదా! నీ కింకా ప్రభువేమిటా? అంటారేమో? యీ దేశంలో పురుషునివిషయంలో స్త్రీ యెల్లా పాతివ్రత్యధర్మం అవలంబిస్తుందో పూర్వం రాజవంశం విషయంలో సేవకులకు అటువంటి రాజవ్రతం వుంది. ఆయన నన్ను ఈనాడు వదలిపెట్టవచ్చు. మా తండ్రి ఆయనజమీని నిలిపేను. నే నా జమీని తీసివేయను' అన్నాడు. అనటంలోనే ఆ మాట తీయరాని బాణంవలె ఉన్నది.

౫

బుచ్చిబాబు సోమేశ్వరంతో మాట్లాడుతూంటే వింటానికి వెళ్ళిన పొరుగాయనకు సోమేశ్వరం అన్న మాటలు యెంత శక్తివంతంగా అన్నాడో ఎంత నిశ్చయాత్మకంగా అన్నాడో యథాతథంగా చెప్పే తాఖత్తు లేనివాడు.

కాని ఏదో చెప్పేడు. యథాతథంగా చెపితే జమీాం దారైనా కొంచెం కరిగేవాడేమో. ఇతను చెప్పిన తరహాగా చెప్పిన తరువాత రాజాగారికి కోపం వచ్చింది. ఆయన మెత్తని పరుపుల కుర్చీమీాద కూర్చుండి 'నా జమీాందారీ వీళ్ళ నాయన నిలబెట్టాడు, నిలబెట్టాడనే అందాం. ఇప్పుడు వీడా నిలబెట్టేది? వీడి ముఖానికితోడు ముక్కుపచ్చలారని పిల్లను పెళ్ళి చేసుకున్నాడు. చెల్లెలిని ఓ మూాడోపెళ్ళి ముసలి వానికో యిచ్చి కట్టేడు' అన్నాడు.

నీలకంఠశాస్త్రి అందుకొని 'అయ్యా! వీళ్ళందరూ సంఘద్రోహులండీ, కడుపులోవున్న పిండాలనుకూడా పెళ్ళి చేసుకుంటారు' అన్నాడు.

రాజాగారు 'తాను చేసుకుంటే చేసుకున్నాడు. ఆ చెల్లెలికి అల్లా చేయుట మెందుకు?'

అంటూనే అప్పుడేవచ్చిన పత్రికతీశాడు. ఆ పత్రికలో ఒక పాశ్చాత్యదేశ స్త్రీ వివాహవిషయంలో తన అనుభవా లని వ్రాసింది. దాని తాత్పర్య మిది. సంసారసుఖమనేది స్త్రీకి తనవయసుమీారిన పురుషునితోనే ఉంటుంది–అని.

దొరగారు విసుగుతో ఆ పత్రిక అక్కడ పడవేశాడు. వెంటనే నీలకంఠశాస్త్రిగారా పత్రిక పుచ్చుకొని చదివేడు. ఆయనా అదే చదివేడు. ఇల్లాంటి విషయాల్ని గురించి వారి మతస్థులు చదవటమేగాని దానిని చర్చించరు. అతడు సామాన్యంగా చదవనే చదవడు. అసహ్యించుకుంటాడు.

కాని జమీాందారుగారు నిరంజని వివాహవిషయం తిరస్కరించిన నిమిషంలోనే ఆ వ్యాసం కంటికి కనిపించటం

తాను చదవటం, తనకో ఎవరో తానన్నమాట కాదన్నట్టు చెప్పినట్లనిపించింది. తా నొకమా టనటం, ఆ మాట ఇంకొకడు కాదనటం సహించలే డా ప్రభువు. ఆ సహించలేకపోవటం ఆ ఇంకొకడు తన క్రిందివాడు కావటం మాత్రమే. పత్రికలో యెవరో వ్రాసిరి. అది ఇంగ్లీషు పత్రిక. వ్రాసినది పాశ్చాత్య దేశ స్త్రీ. వాళ్ళు ఏమి వ్రాసినా పరిశోధనచేసి వ్రాస్తారాయెను. అవి ప్రమాణ వాక్యమాయెను. ఏమి చేయటానికి వీలులేకపోయింది. దిగమింగి ఊరుకున్నాడు.

నీలకంఠశాస్త్రి కొక ఊహ పుట్టింది. ఆ కాగితము సోమేశ్వరందగ్గర ఉన్నన్నినాళ్ళు ప్రతిపక్షులు ఆ కాగితం సంపాదించేందుకు ప్రయత్నాలు చేస్తూనేవున్నారు. ఏ వేళ ఎట్లాంటిదో ? సోమేశ్వరానికి యివ్వాళ ఉన్నబుద్ధి రేపు వుండకపోవచ్చు. ఆ కాగితం అతని దగ్గరనుంచి తొలగించటం మంచిదని ఈ సంగతి దొరగారితో అన్నాడు. దొరగారు కొంచెం ఆలోచించారు. ఊహ మంచిదనుకున్నాడు.

తరువాత పదిరోజులకు సోమేశ్వరంయింట్లో దొంగలు పడ్డారు. మరునాడు ప్రొద్దునే చూస్తే ఇద్దరు పెద్దమనుష్యులు దూరటానికి తగినంతకన్నం పడివుంది. వాళ్ళమ్మ లబాయిలు లిబాయిలు ఏడుస్తూంటే కన్నందగ్గరకు పోయి సోమేశ్వరం పకాలున నవ్వేడు. అందరూ విస్తుపోయారు.

ఎందుకు నవ్వుతావు? అని తల్లి అడిగింది. సోమేశ్వరం అన్నాడుకదా 'అదికాదమ్మా ఈ ఊళ్లో మనకన్న దరిద్రులున్నారన్నమాట.' జమీందారుగారికి మన ఒక్కరిమీదనే

కోపం అనుకుంటాను. ఊళ్ళో చాలమందిమీద కోపంవుంది. ఆయన అందరినీ మనకుమల్లేనే చేస్తున్నా' డని.

సోమేశ్వరం యింట్లో యేమాట అన్నా యేపని చేసినా మరునిమిషంలో జమీందారుగారికి తెలుస్తుంది. ఈ మాట మాత్రం జమీందారుగారికి చమత్కారంగా అర్థమయింది. ఈ దొంగతనము చేయించింది తానేకదా. తాను సోమేశ్వరంకన్నా దరిద్రుడా. తనను యెంతమాట అన్నాడు. రాజాగారికి సోమేశ్వరంమీద కోపం ద్విగుణీతం అయింది. ఈ మాటకి జమీందారుగారు యిట్లా అర్థం చెప్పు కుంటాడా అని యెవరికైనా అనుమానం వుంటే ఆ జమీం దారుగారి మనస్సులో అంతరాంతరంలో వున్న ఒక విషయం తెలిస్తే తెలుస్తుంది. ఆ కాగితం బుచ్చిబాబుకి దొరికిందను కోండి. అప్పుడు జమీందారుగారు సోమేశ్వరంకన్న దరిద్రుడేకదా. ఈ ఊహ ఉన్న దాయన మనస్సులో.

సోమేశ్వరం నవ్వేడే కాని నవ్విన మరునిమిషంలో ఆ కాగితంవిషయం జ్ఞాపకం వచ్చింది. ఆ కాగితం ఉందో లేదో పోయి చూచాడు. ఆ ఉన్నచోటున ఉండకుండా యెలా వుంటుంది? ఆ కాగితం అక్కడే వుంది. ఆ స్థలం కనుక్కోటం బ్రహ్మ తరం కాదు.

సోమేశ్వరం ఆ కాగితం జేబులో పెట్టుకొని వెంటనే కోటలోనికి వెళ్లేడు. సోమేశ్వరాన్ని కోటలోనికి రానివ్వద్దని రెండేండ్లక్రిందట రాజాగారి ఉత్తర్వు అయింది. ఈ రెండేళ్ళు ఆయన రానేలేదు. ఇప్పుడు వస్తున్నాడు. రావటా

నికి రాజాగారి ఆజ్ఞ అయిందేమో. లేకపోతే యెందుకు వస్తాడు అని యెవరూ అడ్డుపెట్టలేదు.

పైగా ఆ కాపలావాడు ముసలివాడు రామశాస్త్రి గారిని యెరిగినవాడు. ఇంకొకడు 'ఎవరు మీరుఅండీ?' అంటూంటే, ఆ ముసలివాడు వాణ్ణి గదమాయించాడు 'నోరు మూయి యెవరనుకుంటున్నావు అయ్యగారిని' అన్నాడు.

సోమేశ్వరం ఎకాఎకీ దొరగారు, దివాన్‌గారు కూచున్న గదిలోకి వెళ్ళేడు. ఇద్దరూ తలెత్తి చూచారు. దివాన్‌గారు ఆశ్చర్యపోయినాడు. దొరగారు కళవళపడ్డాడు. ఈ దొంగతనము చేయించింది తానేనని సోమేశ్వరానికెల్లా తెలిసిందీ? సోమేశ్వరంఉన్నవాడున్నట్లుగా తానాప్రశ్న వేస్తే తానేమిచెయ్యాలి? నిమిషంలో దొరల్లా దొంగ అయినాడు.

సోమేశ్వరం:- జేబులోనికాగితం తీసి దొరగారి చేతికివ్వబోయినాడు. ఆ దొంగతనములో దొరతనం. అతనిచ్చినకాగితం అందిపుచ్చుకోటం తనదర్జాకు భంగం అనుకున్నాడు రాజా! ఆకాగితం ఏమిటో తెలిస్తే చేయే కాదుకదా శరీరం అంతా చాచేవాడు; ప్రాణంకూడా చాచేవాడు.

దొరతనం తెలియని లక్షణంకాదూ! సోమేశ్వరం ఆకాగితం బల్లమీద పెట్టి యిల్లా అన్నాడు, 'ప్రభూ ఈకాగితం మీప్రతిపక్షులకు దొరికితే మీమీద వ్యాజ్యం వేస్తారు. జమీా మీకు దక్కదు. దీనికోసం మీప్రతిపక్షులు తమకిమ్మని నాదగ్గరకువస్తున్నారు. పోతున్నారు. నాకు డబ్బ

ఆశపెడుతున్నారు. ముప్ఫైవేలుకూడా యిస్తామన్నారు. నేను దరిద్రుణ్ణి. ఈతాకిడికి తట్టుకోలేను. ఎందుకు తట్టుకోలేను? మనస్సునకు సంబంధించినదైతే తట్టుకోగలుగుదును. తట్టుకున్నాను. ఇకముందైనా తట్టుకోగలను. ప్రతిపక్షులు నాయింటికి యీ కాగితంకోసం కన్నాలు వేయిస్తుంటే నేనేమి చేయగలను? ఇవ్వాళ వాళ్ళచేతికి చిక్కలేదు. రేపు చిక్కవచ్చు. ఈకాగితం తగలపెడదామనుకున్నాను. చివరికి తెచ్చి తమచేతికిద్దామనుకున్నాను. ఇది మీచేతికివ్వటం మళ్ళీ మీ దయ సంపాయిద్దామని ఏమాత్రంకాదు. పూర్వం మీఉప్పుతినిఉన్నాము. ఆఋణంతీర్చటానికే చేస్తున్నాను' అని మళ్లీ యిలా అన్నాడు. 'పెద్దబాబుగారు చాల పెద్ద మనిషి అనుకున్నాను. ఇటువంటి నీచపుపని చేస్తాడనుకోలేదు' అని కాగితం బల్లమీదపెట్టి వెళ్ళిపోయినాడు.

జమీందారుగారికి అతను తిట్టి వెళ్ళిపోయినట్లుగా స్ఫురించి తాను చేసినది నీచపుపని; తాను నీచుడు; తానే యీకన్నం వేయించానని సోమేశ్వరానికి తెలుసు; తెలసే తిట్టడానికి వచ్చాడు; తిట్టాడు; వెళ్లాడు. తానే కోటలోనుంచి అతనిని ఊరికే పోనిచ్చాడు

తరువాత నెల్లాళ్ళు గడిచింది. ఊరంతా యీ కన్నం వేయించింది పెద్దబాబుగారే అని చెప్పుకుంటున్నారు. కన్నం వేయించింది పెద్దబాబుగారు కాదని తెలిసినవాళ్లు నలుగురు. ఒకడు పెద్దబాబుగారు, రెండవవాడు జమీంధారుగారు, తక్కినయిద్దరు ఒక్కడు కన్నం త్రవ్వినవాడు, ఒకడు జమీందారుగారికి ఆంతరంగికుడైన గుమాస్తా. ఇంట్లోకివెళ్ళి

కాగితాలన్నీ వెతికినవాడు గుమాస్తా. అతనిపేరు రంగరాజయ్య.

ఈ రంగరాజయ్య రాజాగారికి పరమఆప్తుడు. రాజాగారికి రాణిగారంటే యెక్కువ యిష్టమా? రంగరాజయ్య అంటే యెక్కువ యిష్టమా? అని ప్రశ్నవేస్తే రాణీగారంటే యిష్టము; గౌరవం; రంగరాజయ్య అంటే ప్రేమ. రంగరాజయ్య బ్రాహ్మణులలో ఒకడు. రాజాగారతనిని ఏరా అంటాడు. ముద్దుగా బూతులు తిడతాడు. అతను గుమాస్తా అనటానికి వీలులేదు. కోటలో అతను చేసేపని ఏమీలేదు. అతనొక వేటకుక్క. దూరంగా లేడి కనిపిస్తుంది. పులి కనిపిస్తుంది పంది కనిపిస్తుంది. మెడపట్టెడ ఊడదీసి వేటనిచూపించి వదలిపెట్టడమే. జాగిలంకూడా అట్లా వేటాడ లేదు. పులిఅయినాసరే పిక్కపట్టుకుంటే ఎంతైనా విదిలించు కోనీ! వీడిపట్టు వదలడు. రాజాగారు గావాలి వేటను వెయ్యాలి. జాగిలం అనేది రంగరాజయ్యముందు పనికిరాదు. జాగిలం అంటుంమూలంగా నిరతురకుక్షి కాదు. సువ్వాలు ముంచి దీపాలు ఆర్పుతాడు.

రాజాగారికి ఒక్కజమీాయేలేదు. స్వంతకమతం ఉంది. జమీామీాద వచ్చినంత కమతంమీాద వస్తుంది. వడ్డీ వర్తకం ఉంది. తాకట్టుపెట్టుకోటం ఉంది. ఈ కాగితాలన్నీ వ్రాసేది రంగరాజయ్య. ఒక తాకట్టుకాగితం వ్రాస్తే ఒక్క నోటు వ్రాస్తే దానిలో పెట్టే షరతులకి ఆ కుటుంబం కుటుంబం ఆర్చుకపోవలసిందే!

వేటలో రంగరాజయ్యా పసిపట్టటం చాలవిచిత్రంగా పడతాడు. వేట చెరువువొడ్డున వుందనుకోండి. అదినీరుతాగే తరహా. తాగి, వెళుతూఉంటుంది. వెళ్ళేతరహా, ఒళ్ళుదులుపు కుంటుంది. ఆతరహా, వెనుతిరిగిచూస్తుంది, ప్రక్కచూపులు చూస్తుంది. సీటుగా నడుస్తుంది. ఏపని చేసినాసరే ఆచాలన విశేషంలో ఒకలీలా విశేషం చూస్తుంది యీవేటకుక్క.

ఇక చెప్పండి! రాణీగారంటే యిష్టమా? రంగ రాజయ్యా అంటే యిష్టమా?

ఈనెల్లాళ్ళు, సోమేశ్వరంతల్లి కొక పిచ్చి ఆశ. రాజాగారు కొడుకును పిలచి మళ్ళీ ఉద్యోగం యిస్తాడని. లేకపోతే ఒక పాతికవేలు పంపిస్తాడని.

సోమేశ్వరం తల్లితో చెప్పేడు 'అమ్మా! నీకెందుకిటు వంటి పిచ్చిఆశలు. నేను వెళ్ళి కాగితం యిస్తే రాజాగారు కూచోమనలేదు. ఆయన ముఖంలో దయ అనేది కనుపించ లేదు. అట్లాంటివాడు ఎందుకిస్తాడు?' అని.

కాని పాపం! ఆమెఆశ నెలకాదు, రెండునెలలుకాదు, ఆరునెలలవరకు అట్లాగే వుంది. అప్పటికి ఆశలో నూరు పాళ్ళలో తొంభైపాళ్ళు విరిగిపోయినవి. తక్కినపాలు ఆవిడ బ్రతికిఉన్నన్నాళ్ళు పోదు సరికదా! అప్పుడప్పుడు దానికి వడ్డీ పెరిగినట్లు మాట్లాడుతుంది.

ఈ ఆరునెలల్లో సోమేశ్వరం పని సరిగా భర్తృహరి చెప్పినట్లు అయింది. గంగ స్వర్గంనుండి శివ జటాజూటానికి, అక్కడనుండి హిమవత్పర్వతానికి, అక్కడనుండి ధాత్రి మీదికి, అక్కడనుండి పాతాళానికి.

నిరంజనికి పెండ్లియయి యిప్పటికి రెండేండ్లు కావచ్చింది. ఆ పిల్ల ఎప్పుడు రజస్వల అయిందో ఎవరికి తెలియదు. కార్యమనేది ఎప్పు డయిందో ఎవరికి తెలియదు. కాని కూతురు పుట్టింది.

కూతురుపుట్టినతరువాత నిరంజనిభర్తకు బావమరిది మీాద అమిత ప్రేమ పుట్టింది.

నిరంజనిభర్తపేరు నాకు తెలియదు. అతని పేరు నిరంజనుడు అందాం.

అతను కొద్దిలో మన జమీాందారంతటివాడు. ధాన్యం నిలవపోస్తాడు. అపరాలు నిలవపోస్తాడు. వడ్డీలకిస్తాడు. ఊళ్లో దస్తావేజులన్నీ వ్రాసేది అతనే. వైదీకులైనా గ్రామకరణీకం ఉంది. నెల అయ్యేటప్పటికి రెండువందలు కళ్ళచూస్తాడు.

కొత్తగా పుట్టిన కూతురంటే అతనికి ఆ అపేక్ష చెప్పటానికి వీలులేదు. ఈ భార్య వచ్చింది. ఈ దశ అందు కుందని అతని అభిప్రాయం.

నిరంజనికి తిరుపతి వెంకటేశ్వరుల పూనకం వస్తూనే ఉంటుంది. ఒక ఏడాదిలో ఆ వూరంతా తిరుపతి వెంకటే శ్వర్లుకి ముడుపులు కట్టినవాళ్ళే అయినారు.

నిరంజనిని ఏమైనా అంటే పూనకం వస్తుంది. ఆమె ఎంతచెపితే భర్త అంత.. సోమేశ్వరానికి నాలుగువేళ్ళు నోట్లోకి పోతున్నై.

౬

నీలకంఠశాస్త్రిగారి యింటికి వారిగురువు వచ్చాడు. ఆయన ఔత్తరాహుడు. సహజంగా వాళ్ళభాష హిందీకదా!

ఆయన ఆ భాషలో పెద్దపండితుడట. మనిషి పండు తమల పాకల్లే ఉన్నాడు. తల నెరసింది. యాభై యవ పడిలో ఉండ వచ్చు. తలమీద అందమైన క్రాపింగు. ఆయన నేత్రాలు విశాలములు. చెంపకు చేరజేసి కనులన్నట్లుగా ఉంటవి. నిదానించి చూస్తే ఆ కళ్ళు పొడుగెక్కువ వెడల్పు తక్కువ. మొగం చూట్టంతోటే భాగ్యశాలి అనిపిస్తుంది. కనురెప్పల కెప్పుడూ సన్నంగా కాటుక పెడతాడా అనిపిస్తుంది. పెట్టడు కాని ఆ రెప్పల తుదలయందది సహజమైన రంగు. పారశీ వాడా అనిపించేంతముక్కు. పుష్టిగల మనిషి. పుష్టిఅంటే బలం అనికాదు. నా ఉద్దేశం—పోషణ. నాతిసూలుడు, నాతికృశుడు.

పట్టు లాల్చి తొడుగుతాడు. తొమ్మిదిగజాల సన్నని పట్టుపంచ బంగాళా కుచ్చెళ్ళు వదలిపెట్టి కడతాడు. చేతికి మణికట్టు గడియారం ఉంది. ఆ గడియారం అప్సరస స్త్రీ కంటిపాప అంత ఉంటుంది. దానికి మణికట్టుచుట్టూ తిరిగి వచ్చే గొలుసు ఈనకట్ట పుల్లంత వెడల్పు. అడుగున బంగారం ఉందేమో తెలియదు. పైన సన్నసన్నని రత్నాలు. లాల్చి రొమ్ముమీద ఫౌంటెన్‌పెన్ పెట్టేందుకు జేబూ. ఆ కలం మిక్కిలి అందమైనది. దాని క్లిప్పు రత్నమయం. మెడలో ఒక సన్నని బంగారు గొలుసు. మీసాలు లేవు. పైన మడతపెట్టిన జరీపట్టు ఉత్తరీయం.

ఆయన తొడిగే చెప్పులు, లేత తమలపాకులంటే పోలిక బాగుంటుందేమో ఆలోచించండి! ఉంగరాలు లేవు. పెట్టెలు, వారలు ఒక సుకుమారమైన మెత్తనిరంగు కలవి. ముఖమల్‌తో చేయబడినవి. ఆ చెప్పులు చూస్తే ఎప్పటి

కప్పుడు క్రొత్తగా ఉంటవి. వాడినట్లు కనిపించవు. నిజానికి వాటికి వాడకం లేదు. ఆయన పాదములకు, ధాత్రికి, సంసర్గం లేదు. భూమిమీద నడవడా అంటారేమో భూమి మీద నడవడు. పట్టుతివాచీలమీదనే నడుస్తాడు. తివాచీ మీది కాలు కారులో పెడతాడు. కారులో కాలు తివాచీ మీద పెడతాడు.

రైళ్ళమీద వెడతాడు కదా ! కనీసం ప్లాటుఫారం మీదనైనా కాలు పెట్టవద్దా? అంటే పెట్టడు. ఏమి జరుగుతుం దంటే కొందరు మొక్కుబళ్ళు చెల్లించుకుంటారు. బాజా భజంత్రీలతో వెళ్తూ ఉంటారు. దారివెంటనే చీరలు పరుస్తూ పోతారు. ఆ చీరలమీద నడుస్తూ వీళ్ళు వస్తారు. అల్లా నడకకు తివాచీలని కొన్ని ఉన్నై. అట్లా శిష్యులు వేస్తూ ఉంటారు తీస్తూ ఉంటారు. ఆయన రిజర్వుచేసిన ఫస్టుక్లాసులో పోయి కూచుంటారు.

ఆయన మతం తెలుగుదేశం అంతా ఆవరించింది. ఊరూరా ఆయన మతానుయాయులు.

ఆయన మతానికి ప్రధాన సూత్రాలు: వర్ణాశ్రమ ధర్మాలు లేవు. అంటే కుల వివక్షత లేదు. హరిజనులు చేర వచ్చునా? అంటే ఎవరూ ఆ మతంలో చేరినట్లు కనిపించదు. ఈ మతంలో చేరినవారందరూ ఉద్యోగస్థులుగా కనిపించు తారు. ఆ ఉద్యోగంకూడా వందరూపాయలకు లోపుగా కని పించదు. గెజెట్టులో పేరు నమోదు కాకపోతే, ఆ మతంలో చేరినట్లు కనిపించదు. వాళ్లు గుంపుగా చేరి ఉభయ సంధ్యల యందు ప్రార్థనలు చేస్తారు. అవన్నీ హిందీభాషలో ఉంటై.

దొరగారి మతానికి దీనికి యిది భేదం. దొరగారి మతంయొక్క ఋషులు వారి ప్రార్థనలు అవన్నీ ఇంగ్లీషు భాషలో ఉంటాయి. దివాన్‌గారి మతం హిందీ భాషలో. ఒకవేళ దొరగారి మతస్థులైనా ఇంగ్లీషు బదులు తెలుగు వాట్టం ఉంటుంది. ఈ మతంవాళ్లు హిందీయే వాడుతారు. వాళ్ళకి తెలుగు హిందీలో చెపితే ముద్దార్. ఇంగ్లీషులో చెపితే టేబూ.

ఈ ప్రార్థనలు రోజువారీవి కాక గురువుగారు పుట్టిన రోజు, ఆయన అక్షరాభ్యాసం అయినరోజు, పుట్టువెంట్రుకలు తీసిన దినమూ యిలాంటి కొన్ని రోజులు కేటాయింపుగా ఉంటవి. ఆరోజు ప్రార్థనలు మోపుగా ఉంటవి. కనీసం రెండుగంటలైనా ఉంటుంది సాయంత్రం. ఈ మతస్థులందరూ ఉద్యోగస్థులతో పనులున్నవాళ్ళూవచ్చి, ఆప్రార్థనామందిరం ఎదుట వాళ్ళమతాన్ని తిడుతూ ఉంటారు. ఈ తిట్టటానికి ఫలం దక్కకపోదు. ప్రార్థన అంతా అయింతర్వాత మైసూరుపాకమో, బర్ఫీవో, గురువుగారికి యిష్టమైన ఒక చక్కని ఔత్తరాహమైన మిఠాయో ప్రసాదం చిక్కుతుంది. ఆ ప్రసాదం ఎక్కువ తక్కువలు ముట్టుతె మనిషినిపట్టి. ఇప్పుడు కాకపోతే పోనాయెను. ముందైనా మన మతంలోకి వస్తాడనే కవళికలు తోస్తే వాడికిబ్బడిగా ముబ్బడిగా ముడుతుంది. ఆప్రసాదపు రుచిమరిగిన కొందరు యీమతంమీద, వాళ్ళకేమీ యిష్టంలేకుండానే ఆమతాన్ని పొగుడుతుంటారు.

ఆ మతానికీ పెద్ద వేదాంతం ఉంది. అంటే థియాలజీ అనుకోండి. వాళ్ళకి సంజ్ఞ ఒకటి ఉంది. అది ఓంకార

సదృశం. ఓంకారం మాత్రంకాదు. మంత్రశాస్త్ర సంబంధంలేని ఒక శబ్దపరిణామవాదం వారికి లేకపోలేదు. దొరగారి మతంవాళ్ళు ఉపనిషత్తుల నెల్లా పట్టుకొని దేవులాడుతారో, వీళ్ళు హఠయోగం వాటినల్లా పట్టుకొని దేవులాడుతారు. మణిపూరం, అనాహతం, సహస్రారం యివన్నీ ఉన్నై. కాని ఆజ్ఞాచక్రం మొదలైన మాటలు మాత్రం లేవు. ఒక అనాహతం ఉందనుకోండి. దానిలో శివుడు, శివ యిద్దరూ ఉన్నారని మనవాళ్ళు చెపుతారనుకోండి. వాళ్ళ అనాహతంలో యీ శివులు లేరు. వాట్లలో వాళ్ళ గురువు ఉంటాడు. ఇల్లాగ ఉంటుంది.

అంతదాకా ఎందుకు? బుద్ధుడు ఒక నిర్వాణమతం పెట్టేడు. ఆమతం బలిసి బలిసి సనాతనమతం:అంటే యిష్టం లేనివాళ్ళందరూ ఆమతంలో కలిసి దానిక్కూడా సనాతన మతానికున్నంత హంగామా పెంచారు. దేవతలు, ఇంద్రులు, బోధిసత్త్వాలు, అనేక స్వర్గాలు, మనపురాణాలు, శాస్త్రిలు, ఇతిహాసాలను మింగిన కథ. క్రైస్తవమతంకూడా ఏదో అచ్ఛంగా ఉన్నట్టు కనిపిస్తుంది తప్ప, ఆ గ్రీక్, లాటిన్ మతాల్లోని పీరబ్బు దేవతలు, సినై పర్వతం మ్యాజెస్ దేనినీ వదలించుకోలేదు.

మనుష్యుడు కేవలం బ్రహ్మపదార్థంగా తన్ను తా ననుకొంటాడు, కాని వీడికి భార్యా, బిడ్డలున్నారు. సంసారం ఉంది; ఊరుఉంది. తాలూకా, జిల్లా, భాషా రాష్ట్రం, రాజధాని, దక్షిణాపథం, భారతదేశం, ఏషియా ప్రపంచం - యీ మెట్లన్నీ ఉన్నై. ఉన్నచోటునుంచి

యీమెట్లు పెరుగుతై అనుకోండి. వీటిల్లో ఒక్కొక్కదానిని గురించి కావలసినన్ని సంబంధాలు. కొన్ని వట్టి భావసంబంధాలు వట్టి భావసంబంధాలుమీద ఎక్కువ దురభిమానం. ఇది లౌకికమైన సంబంధం. మా స్నేహితు డొక డున్నాడు. వైష్ణవుడు. సాలునకు నాలుగైదువేలు వస్తవి. ఒక్కడే కొడుకు రెండు, మూడాస్తులు వారసత్వపు హక్కుఉంది. ఆ కొడు కేదో ఉద్యోగంకూడా చేస్తున్నాడు. అతనికొక చిన్న కుమారుడు. ఆ మనమడూ కొడుకూ ఒక్కసారి చనిపోయి నారు. ఆ నాస్నేహితుడు మంచిపండితుడు. సంస్కృతాంధ్ర ములు గట్టిగా చదువుకున్నాడు. శ్రీభాష్యం, ఉపనిషత్తులు గురుముఖతా చదువుకొన్నవాడు. అనేక స్తోత్రాలు కంఠతః వచ్చినవాడు.

ఆయన అన్నాడుకదా! ఒకరోజు నాతో 'ఔనండీ! సర్వవేదాంతం తెలుసు శిష్యులకు పాఠాలుకూడా చెప్పేను. ఏమిలాభం? ఈ ఆత్మ శరీరమందు లగ్నమై ఉన్నదని ఎంత చదివినా ఎంత తెలిసినా యీ జీవుడు యీ శరీరాన్ని వదలి ఆలోచించేట్టు, వదలి ఉండేటట్టులేదు' అని.

ఈ జీవుడు యీ శరీరంలో ఉండి లౌకికంగా తన సంబంధం అంతర్జాతీయత్వం దాకా పెంచుకున్నట్లే. అయథార్థంగా మనకు కనిపిస్తూన్న యీశరీరం బయటఉంది. ఆ యథార్థం అయినదై మనకు కనిపించని యింకొక ఆవరణ యేదో దేవునకు ఉండి ఉండాలి. లేకపోతే ఇంతమంది దేవ తలు, ఈ స్వర్గాలు, ఈ నరకాలు యీ నానాలోకాలు

ఉండవు; ఈ కల్పన అంతా ఒక్క సనాతనమతమే చేసిందా! ఇది జీవుని లక్షణం.

మతాలు కల్పించినవాళ్ళు జీవులుకారా. వాళ్ళూ యీబాధలే పడ్డారు. ఇందులో కొందరి జీవులకల్పన మరి కొందరితరజీవుల కల్పనకు వ్యతిరేకమైన ఊహా కథ కాదండీ! సమాధిలోకి వెళ్ళాడనుకోండి. అది అచ్ఛమైన సమాధికాదు. మధ్యాదాదిలో తన ఒడలు తనకు తెలియని ఒకస్థితి. తన బాహిరమైన అనేక సంస్కారాలు స్వప్నంలో వచ్చినట్లే, ఆస్థితిలో తాము నిలవ త్రొక్కుకుంటై. అదంతా మతం క్రింద లెక్క. సూత్రాలు నిర్మించటం. లోకానికి కనిపించేది, వానిఒళ్లు వానికి తెలియటం. లేదనిమాత్రమే. తాగితే ఒళ్లు తెలియదు? ఉపవాసాలచేత పైత్యోద్రేకం కలిగితే ఒళ్లు తెలియదు. శారీరకమైన ఒక మహాసుఖం అనుభవిస్తూంటే ఒళ్లు తెలియదు. ఒక్కొక్క విషయమందభిమానం. ఉంటుంది. ఒకశాస్త్రం, కవిత్వం, సంగీతం, భజనా, యిల్లాంటివి కొంత పైత్యంతో కలసి ఒళ్ళుమరపిస్తవి. ఒళ్ళుమరచిపోవడానికి శరీరంలో ఉన్న వాత, పిత్త, శ్లేష్మాలు కొంతవరకు కారణం. అవి వ్యాధిఅని అనిపించకుండా వ్యాధి రూపకంగా పరిణమిస్తవి. పైత్యపురెల్ల అంటాం. సామాన్యులకు వస్తే రెల్ల. భజన చేస్తూ చేస్తూ ఆరెల్ల వస్తుంది. అది తన్మయత్వం. అది సమాధి.

ఇది ఊరికే విషయం విచారించటం.

ఆనాడు గురువుగారు నిజంగా సమాధిలోకి వెళ్ళేవో మనకు తెలియదు. ఆ ఊళ్లోమాత్రం ప్రథమ సమాధి

అదే! ఇంటికప్పు లేచిపోయేటట్టుగా భజనలు జరిగినై. కొబ్బరికాయలు కొట్టటం వాళ్ళ మతంలో అలవాటులేదు. మన దేశంలో అనాదిగా ఉండే మతం ఒకటి ఉందిగా. ఆ మతంలోంచి అప్పు తెచ్చుకొని పది కొబ్బరికాయలు కొట్టేరు. గురువుకి స్మృతి వచ్చింది. ఆరోజున గురువు ఏది చెప్పితే ఎవళ్ళు చెయ్యరు!

నీలకంఠశాస్త్రి తండ్రి దేవతార్చనా మొదలైనవి కర్మల పన్నెండోనాడే బ్రాహ్మణులకు దానం యిచ్చినా అసలు బాలాయంత్రం యింట్లోనే ఉంచుకున్నాడు. ప్రతిశుక్ర వారం రాత్రిపూట కంఠస్నానంచేసి, ఒక పట్టుబట్ట కట్టుకొని, ఆ యంత్రంమీద యింత కుంకుమచల్లి ఒక కొబ్బరికాయ కొడతాడు. ఆ సమయంలో మాత్రం పనిచేసేవాణ్ణి పడమ టింటిలోనికి రానివ్వరు. ఈ సంగతి గురువుగారికి తెలుసు. ఆయన శిష్యునితో చెప్పేడు, 'ఇది బాగా లేదోయీ' అని.

నీలకంఠశాస్త్రి ఆ యంత్రం తీసుకొని ఊళ్ళో ఒక శాస్త్రిగారికి యిచ్చి వద్దామని బయలుదేరేడు. ఆయన కొడుకు స్వామికి ఈ సంగతి తెలిసిందో, తెలియదో, వాడు, గురువుగారు కూచున్న గదిలోకి వెళ్ళి అక్కడ ఒక పటం ఉంటే దాన్ని తన్ని గురువుగారిని బండబూతులు తిట్టేడు. తండ్రి వచ్చాడు. చూసేడు. స్వామికి తన ఒళ్ళు తనకు తెలియదు. అతనికి పిచ్చి అని అందరకూ తెలుసుగా. గురువుగారు వాళ్ళ ఓంకార సదృశమైన మాట జపంచేస్తూ కూచున్నాడు. స్వామిని తీసుకోవెళ్ళి ఒక గదిలో పెట్టి తాళం వేశారు. ఆ గదిలోనుంచి ఏడ్పులు బూతులు పెడ

బొబ్బలు. కొంత ప్రొద్దుపోయిన తరువాత స్వామి శాంతించి పడుకున్నట్లుంది. ఆరాత్రే యంత్రం ఇంట్లోంచి వెళ్లిపోయింది.

పిల్లవాడు శాంతించాడని తలుపు తీశారు. స్వామి చలీ, చప్పుడు లేకుండా గురువుగారిదగ్గరకు పోయి ఆయనను లాగి చంపకాయ కొట్టేడు. స్వామికి పదేండ్లున్నై. పుష్టికల కుఱ్ఱవాడు. చదువులేని వాఠడి శరీరబలంలో ఉంది. ఆ దెబ్బకు గురువుగారికి గింగురులెత్తినై. నీలకంఠశాస్త్రి పైప్రాణాలు పైన పోయినై. శాస్త్రిని ఓదార్చాడు గురువుగారు కుఱ్ఱవానికి నయం ఔతుందని.

శాస్త్రీ ! నీవుమాత్రం ప్రార్థనలు సరిగా చెయ్యి అన్నాడు.

## ౭

ప్రార్థనామందిరంలో ఒకనాడు అయిదారుగురు యువకులు కూర్చున్నారు. వారు లోక సిద్ధాంతాలను గూర్చి మాట్లాడుచున్నారు. ఎవరు ఏమి మాట్లాడినా మన దేశంలో సంఘం అంతా పుచ్చిపోయిందని, అనవసరంగా కర్మకాండ పెరిగిపోయిందని, ఇదంతా బ్రాహ్మణులు స్వలాభపరాయణులై చేశారని ఎంతసేపు మాట్లాడినా తాత్పర్యం యిదే.

ఆ ప్రార్థనామందిరంలో ఒక పుస్తకభాండాగారం ఉన్నది. అది జమీందారుగారు ప్రజోపయోగంకోసం ఏర్పాటు చేసినది. జమీందారుగారు లోకంకోసం చాలా ఉపకారములైన పనులు చేశారు. వానిలో ఇదొకటి. పుస్తకాలు ఎవరు పడితే వారు వచ్చి అక్కడ కూర్చుండి చదువు

కొనవచ్చు. దానికి వారి మతస్తులే కానక్కరలేదు. దేవిడీలో మన్నా అయినా ప్రార్థనామందిరంలో మన్నా లేదు.

సోమేశ్వరం అప్పుడప్పుడు అక్కడికి వస్తూవుంటాడు. ఆ రోజున వచ్చాడు. అత డేదో పుస్తకం తీసి చదువుకుంటూ ఉండగా ఈ యువకుల వాదన అరుపులతో బలిసి అతనిని చదువుకోనిచ్చింది కాదు. ఆతను కొంతసేపు మొగము మురకటించుకున్నాడు. అది చూచిన ఆ యువకులు అత న్నింకా వేధించవలెనని మరీ పెద్దగా వాదించడం ఆరంభించాడు. అతనుచేసేది యేమీా లేక పుస్తకం మూసి అక్కడ అప్పచెప్పి వెళ్ళిపోవటానికి బయలుదేరాడు. ఆ యువకులు అతనిని చూచి హేళనగా పకాపక నవ్వారు. అత డంత వరకు ఓర్చుకున్నాడు. ఈ చివరిది ఓర్చుకోలేక పోయినాడు.

జమీాందారుగారి పత్రం ఆయనది ఆయనకు తీసుకొని వెళ్ళి యిచ్చిన తర్వాత నాలుగైదు రోజులకు జరిగినది ఈ ఘట్టం.

ఈ నాలుగైదు రోజులలో సోమేశ్వరం యింట్లో క్రొత్త క్రొత్త ఇబ్బందులు వెలసినవి. అతడు 'అయ్యో! ఆ పత్రం ఎందుకు ఇచ్చివేశానే; జమీాందారుగారి ప్రతి పక్షులు పాతికవేలదాకా యిస్తామన్నారు. చేతులారా చెడ గొట్టాను. నాయనగారు చేసిన సత్కార్యం నేను చేతులారా ధ్వంసంచేయటం బాగుండదని అనుకున్నానే కాని; ఆ జమీాందారుగారికి మనమీాద అభిమానం లేదు.

ఆ జమీాందారుగారు గొప్ప దాత. ఆయన అనేక మంది బీదవిద్యార్థులకు చదువు చెప్పిస్తాడు. ఎన్ని సంస్థలకో

దానాలు చేస్తాడు. మనం అంటేనే పడదు. ఎందుకు పడదు? అంత దాత గదా! ఆ దాతృతాగుణము మనదగ్గరకు వచ్చే టప్పటికి ఎందుకల్లా ముడుచుకోవాలి! నిజమైన దాతృతా గుణము ఇల్లా ఉంటుందా? ఒక విషయమునందు కల ఆవేశము ఆయనను దాతను చేసింది. అది ఆయన యొక్క తద్గుణావేశమే కాని; నిజమైన దాతృతా గుణము కాదు. లోకములో వేలమంది దాతలుగా ప్రశంసింపబడతారు. వాళ్ళల్లో నిజమైన దాత ఒక్కడుంటాడేమో.

నిజమైన దాత అయితే ఎదటవాని పేదతనము చూచి ఇస్తాడు గాని; వాడు చేసేపని తన కభిమతమా? అనభిమతమా? అని విచారిస్తాడా? వీరుడైన దాతకు ఈ విచారణ ఉండదు.

వెనకటికి దుర్యోధనునకు కర్ణుడే దాత యేమిటి? ఆ కర్ణుడు తా నిచ్చిన అంగరాజ్యం మాత్రం కలవాడు. తాను అసలు చక్రవర్తి అనిపించినదట. ఈ సంగతి పరమేశ్వరుడి చిత్తాలో నమోదయినది. ఆ పరమేశ్వరుడు ఒక వృద్ధబ్రాహ్మణవేషంతో వచ్చి దుర్యోధనుని అడిగాడట. 'మహాప్రభూ! నేను యజ్ఞం చేయదలచుకున్నాను. నాకు వంటకట్టెలు కావాలి' అని. దుర్యోధనుడు అట్లాగే నన్నాడు. ఆ బ్రాహ్మడు యిప్పుడు గాదు స్వామీ, నే నింకా యజ్ఞం మొదలుపెట్టలేదు. మొదలుపెట్టిన తర్వాత వచ్చి అడుగు తాను అని వెళ్ళాడు.

వర్షాకాలం వచ్చింది. మేఘాలు చెట్ల పైభాగంనుండి ఆకాశంలో ఎక్కడికో పరకు ఒకదానిమీద ఒకటి పేర్చి నట్లుగా అంతా యింతా దళసరి కాకింకా నాటంతటవి అల్లా వచ్చి కింద కూర్చున్నట్లుగా కింద గఫేలున పడ్డట్లుగా విసుపు

కుని పదిహేను రోజులు పగలు లేదు రాత్రి లేదు. ఊరికే వీచే పెద్దగాలికి వానధారలు ఒడ్డిగిల్లడమే గాని ఆ వొడ్డిగిల్లిన తెరపిలో మళ్ళీ ఒడ్డిగిల్లిన ఇంకో వాన ధారలుగా దుంప తెంచిపారవేసి నిప్పు వెలిగిస్తే వెలగటానికి వీలులేనంత లోకం లోకం అంతా ఇవము కమ్ముకపోయేటట్లు కురిస్తే అసలు అగ్నిహోత్రము యొక్క, జ్వాలల యొక్క అణువులు మధ్యప్రదేశాలలోగూడా వానచెమ్మ దమ్ముకుంటూంటే అప్పుడు వచ్చి ఈ బ్రాహ్మణుడు దుర్యోధన మహారాజుతో అయ్యా! కట్టెపుల్లలిప్పిస్తామన్నారుగదా యిప్పించవలసింది అని అడిగాడట.

ఆ మహారాజుకి ఆ సమయంలో కట్టెపుల్లలకు కూడా లేని మంట పుట్టుకవచ్చింది. పో పోవయ్యా! మీ బ్రాహ్మలంతా యింతేను అన్నాడట. ఆ బ్రాహ్మడు అయ్యా! మీ మీద నమ్మకం పెట్టుకున్నాను. యజ్ఞానికి ముహూర్తం యిప్పుడు కుదిరింది. దాత కర్ణుడున్నాడుగాదా ఆయన నడుగుతానని వెళ్ళేడు. దుర్యోధనుడు నవ్వి ఆ కర్ణుడు మాత్రం ఎక్కడ తెస్తాడో చూస్తానన్నాడు.

ఆ రోజున సాయంత్రం మైనపుగుడ్డలు కప్పిన పెద్దపెద్ద బళ్ళు దుర్యోధనుని యింటి ముందుగా పోతున్నవి. దుర్యోధనుడు కిటికీలోనుండి చూచి ఏమిటా బళ్ళు? అన్నాడట. ఆ బ్రాహ్మడు చక్కా వచ్చి మనవిచేశాడట. అయ్యా! కర్ణుణ్ణి అడిగాను. ఆయన యీ వానలో ఎక్కడ పుల్లా తడిసిపోయింది అని తన మేడలు రెండు పగులకొట్టించి దూలాలు

వాసాలు యిప్పించాడు. అవి తడిసిపోకుండా మైనపుగుడ్డలు వేసి పంపిస్తున్నాడు అని చెప్పాడట.

దుర్యోధనుడు మరి యింకొకప్పుడైతే ఏమి మూర్ఖుడు కర్ణుడు మేడలు పగులగొట్టుకొని దానంచేస్తాడా అనేవాడే. కాని తనకు రాని కీర్తి కర్ణుడికి వచ్చిందని మనస్సులో వుందిగా, అందుకని నిజమే దాతంటే అతడే దాత. నే నేమి దాతను. డబ్బు ఉంటే దాత కాడు. వాడు స్వతస్సిద్ధంగా దాత అయి వుంటే అవుతాడు అనుకున్నాడట. దాత అంటే యిది.

మా జమీందారుగారు దాతగాదు. ఆయన యిష్టం వచ్చిన పనులకీ ఆయన యిష్టమైనవాళ్ళకి డబ్బు యిస్తాడు.

ఇదేమి రోజులో అన్నిధర్మాలు పోయి యిష్టమనే ధర్మం చాలా పైకి వచ్చింది. సరే పూర్వమతాలు పూర్వ ధర్మాలు పోయినవనుకోండి. కృతజ్ఞత మొదలైన అసలు మానవధర్మాలకు ఏమి అడ్డమువచ్చింది? ఈకృతజ్ఞత చూపించటం గూడా మన కుపకారంచేసినవాడు మనసిద్ధాంతంవాడా కాడా అని ప్రశ్నవస్తే అసలు మానవసంఘం ఎల్లా నడుస్తుంది. కృతజ్ఞతకు వెనకా ముందూ వుందా? ఈకృతజ్ఞత అనే గుణంగూడా చచ్చిపోతే ఈ మానవుడు నిజంగా ధర్మకాలంలోంచి పోయి సిద్ధాంతాలకాలంలో పడ్డాడన్నమాటే. తన కేది సిద్ధాంతమో అదే ధర్మం; అదే మానవప్రకృతి; అదే సంఘ; అదేరాజనీతి, ఇక అన్నీఅదే.

పోనీలే ఈయిబ్బందులు నాకు కొత్తగా వచ్చినయ్యా యితరులకు సిద్ధాంతాలు వున్నయ్యని నేను నా తండ్రి చేసిన

సత్కార్యానికి వ్యతిరేకంగా చేయలేదు. నా కంతే చాలు అని సోమేశ్వరం మనస్సులో ఎగుళ్ళుదిగుళ్ళుపడి గగ్గోలవు తున్న సమయం.

ఈకలవరాన్ని తగ్గించుకోటానికి గ్రంథభాండాగారానికి వచ్చాడు. అక్కడ ఈయువకులు అతనిని అవహేళన చేశారు. వట్టియప్పుడు సోమేశ్వరం సామాన్యంగా యివి పట్టించుకోడు. కాని యింట్లో యిబ్బందులు, జమీందారు గారి దయలేనితనము ఈ ఆలోచనా యివన్ని మనిషిని తల క్రిందులు చేసినవి. దానితో ఎందుకో ఊరికే అతనికి కోపం వచ్చింది. వాళ్ళదగ్గరకు వెళ్ళి కొంచెం తెలివితక్కువగా మాట్లాడాడు. దానితో మరీ తెలివితక్కువవాడైనాడు. వాళ్ళ అవహేళనకు మరీ ఎక్కువ వీలిచ్చింది. కొంతసేపటికి తాను తెలివితక్కువగా మాటాడానని తెలిసికొన్నాడు. సామాన్యముగా అతడు తెలివితక్కువ చేయడు. యిప్పుడు ఈ తెలివితక్కువను సర్దుకొనుట కొక్కటే మార్గము. అది మొదలుపెట్టాడు.

అది కాదండీ! మీరు నవ్వితే నవ్వారు. నష్టము లేదు. నాకు కోపం వచ్చిందంటే మీరు నవ్వారని రాలేదు. లోకంలో లక్షమందిని లక్షమంది నవ్వుతారు, తిడతారు, కొడతారు. వాటన్నింటికి ఎవరిది జవాబుదారీ? నన్నుమీరు చదువుకోనివ్వలేదు. దానికికూడా కాదు. మీరు కూర్చు న్నంతసేపూ వింటున్నాను. మన సంఘంఅంతా పుచ్చి పోయిందనీ కర్మకాండ పెరిగిపోయిందనీ బ్రాహ్మణులు స్వలాభపరాయణులై చేశారనీ యివ్వే మాటలుగదా మీరు

మాట్లాడినది. ఈమాటలు మీరు ఊహించినవి కావు. మీరందరు బ్రాహ్మణకులంలో పుట్టినవాళ్ళేనూ. సంఘం యేం పుచ్చిపోయింది? పూర్వం ఎల్లా ఉన్నదో యిప్పుడూ అల్లాగే వున్నది. మనుష్యుడెప్పుడూ స్వార్థపరుడు. ధనవంతు డెప్పుడూ తన ఉద్దేశ్యం ప్రకారం తనాశ్రయించుకున్న వాళ్ళు ఉండాలనేవాడు. అది అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ ఒకేమోస్తరుగాఉంది. ఇంక మీరు ఎంతసేపు మాట్లాడినా బాల్యవివాహాలు విధవా వివాహాలున్నూ. లాలాలజపతి రాయి ఒకపుస్తకం వ్రాశాడు-దురదృష్టపు భారతదేశమని. బాల్యవివాహాలు ఇంగ్లండులోగూడా చేస్తారట. పైగా వాళ్ళ దేశాలలో వివాహమంటే వివాహము, కార్యము ఒకసారి జరగటమే. ఎనిమిదేండ్ల పిల్లకు కార్యంచేయటంలేదు. మీరంటారుగదా పదుమూడేండ్ల పిల్లకుమాత్రం చేస్తారా అంటారు. మనది ఉష్ణదేశం కనుక చేస్తారు. అది కాదయ్యా! మనదేశంలో యూవరేజి జీవితం పాతికయేండ్లేకదా, మరి ఇరవైయేండ్లకు కార్యంచేస్తే సంసారసుఖ మెక్కడ లోక మెక్కడా. అనేకమంది బాలవిధవ లున్నారంటారు. అయ్యో! వీళ్ళకు సంసారసుఖం లేదంటాం. పాశ్చాత్యదేశా లలో వివాహాలు కాని ముదిమిస్సులుంటారు. వాళ్ళకి సం సారం లేదు, కర్మకాండ పెరిగిందంటారు; ఎందుకు పెరగదు? పెరగటం అనేది మనుష్యసహజం. ఒక చిన్న ఉపన్యాసం ఏర్పాటు చేశారనుకోటానికి కార్యదర్శి లేచి నేను ఫలానా వారిని అధ్యక్షుడుగా ఎన్నుకొనుచున్నాను అని చెప్పటం, అధ్యక్షుడు కూర్చోటం, ప్రార్థనా, ఆయన తొలిపలుకు

తర్వాత ఉపన్యాసకుడు మాట్లాడటం, అధ్యక్షుని తుదిపలుకు, తర్వాత కార్యదర్శి వందనములు యిదంతా యేమైంది? ఒక కార్యక్రమంగా నడవలేదా? స్థూలంగా చూస్తే కర్మకాండా యిలాగంటిదే. కర్మకాండ పెరిగింది పెరిగింది అనటంవల్ల లాభ మేమిటి? అసలు రహస్య మిది. తర్వాత యిదంతా బ్రాహ్మణులు చేశారంటారు. యిది మనం యూరపు దేశ చరిత్ర చదవటం మూలంగా కొంతభాగం వచ్చిన దురూహ. ఆ దేశాలల్లో క్లర్జీ (Clergy) అట్లా చేశారేమో. దానిని బట్టి బ్రాహ్మలు యిట్లాచేశారని అనుకుంటారు. మన దేశంలో ప్రభువులు బ్రాహ్మలు కారు; కాదలుచుకుంటే అయ్యేవారే, కాదలుచుకోలేదు. మా నాయనగారు తలుచు కుంటే ఈ జమీందారీ వుండేదికాదు. ఆయన నిలబెట్టాడు ఈ జమీందారీ. ఆయనే గాదు నేనుగూడా నిలబెట్టానని చెప్తున్నాను. ఆ కాగితం చిట్టిబాబుగారికిస్తే ఈజమీందా రేమయ్యేవాడో. అసలు మాపూర్వులు ఈ జమీందార్లను నిలబెట్టినవాళ్ళు!' అంటూ వెళ్ళి పోయినాడు.

ఆ యువకులు ఆర్గురు విస్తుపోయి నిలబడ్డారు. ఈ వార్త క్రమంగా జమీందారుగారికి తెలిసింది. ఇక ఆయ నకు ఈ రామశాస్త్రి కుదురన్నా, ఆ వూళ్ళో తన పురో హిత కుటుంబాలన్నా . . .



సోమేశ్వరం చెల్లెలికి ఒక కూతురు పుట్టింది. అతని బావమరదికి యేదో దీర్ఘవ్యాధి పుట్టింది. ఎంత డబ్బూ ఆ వ్యాధికే అవుతోంది. అందుచేత సోమేశ్వరానికి చెల్లెలు

చేసే సాహాయ్యం లేకపోయింది. మళ్ళీ యింట్లో పరిస్థితులు యథాప్రకారంగా ఉన్నవి.

ఆ మేనకోడలికి అయిదేండ్లు వచ్చినవి. అది మాటలు కొట్టి పోస్తోంది. దాని బుద్ధి చిలువలు పలువలు. ఆ పిల్ల కైదోయేడు రావటంతోటే దాని తండ్రి చనిపోయినాడు.

సోమేశ్వరం చెల్లెలు, మేనకోడలు వచ్చి యింట్లోనే ఉన్నారు. సోమేశ్వరం చెల్లెలికి మొదట కొన్నాళ్లు దుఃఖం, తరువాత దిగులు. ఒక పది నెలల్లో ఎవరో బ్రాహ్మడు యేదో మంత్రం ఉపదేశించేస్తే ఆ మంత్రం దివారాత్రాలు ఆరు నెలలు అదేపనిగా పునశ్చరణ చేసింది. ఈ చెయ్యటంలో యేమి వ్యత్యాసం వచ్చిందో ఆవిడకు కొంచెం మతిభ్రంశం యేర్పడింది.

సోమేశ్వరం మేనకోడలుపేరు నీల. అది ఎదటివాళ్ళు ఏమాటలంటే ఆమాట లంటుంది. ఎలాచేస్తే అలా చేస్తుంది.

ఈ పిల్ల అంటే దేవిడీలో రాణివాసానికి ముద్దయినది. ఆ పిల్ల తల్లి చిన్నప్పుడు కోటలోనికి వెళ్ళటం రావటం జరుగుతూనే ఉండేది. ఇప్పుడు రాకపోకలు ఈ పిల్ల సాగించింది.

ఒక రోజున పెద్దరాణి, చిన్నరాణి కూర్చున్నారు. జమీందారుగారి కూతురు కూడా వున్నది. ఆ కూతురుకు పదిహేనేండ్లు. వివాహం కాలేదు. సంబంధములకు వెతుకుతున్నారు. ఆ జమీందారుగారి కూతురుపేరు భూదేవి. ఆమెను అచ్చంగా తండ్రి తన సిద్ధాంతాల ప్రకారం పెంచాడు. ఆవిడంతా మ్యూజిక్, డాన్సులు ... ఆ పిల్ల చిన్నప్పుడే మిస్సమ్మ

లను తీసుకువచ్చి జమీందారుగారు పిల్ల పెంపకానికి పెడదా మనుకున్నాడు. పెద్దరాణి, చిన్నరాణి ఒప్పుకోలేదు. భూదేవికి ఏడెనిమిదేండ్లు వచ్చిన తర్వాత ఫక్తు దొరసానుల పెంపకం బలిసింది. ఆవిడకి యింగ్లీషు వచ్చినంత తెలుగు రాదు. తెలుగు యింట్లో పుట్టింది గనుక తెలుగు మాట్లాడుతుంది. ఆమె పెద్ద పెద్ద యింగ్లీషు పుస్తకాలు చదువుతుంది. దొరసానివలె వేషం వేస్తోంది. తండ్రి కూతురు గలిసి ఆమె జుట్టు బాబ్ (Bob) చేయించటం జరిగింది. దీనిమీాద కోటలో పెద్ద రవథ అయింది. కాని జరిగిన బాబ్ ఎల్లా పోతుంది. ఆ పిల్ల తల్లీ నాయనమ్మలు యేది చెప్పితే అది కాదంటుంది. పిల్ల అంటే వాళ్ళ కమిత ప్రేమ. కనుక మొట్ట మొదట ఆవిడ చేసేపనులకు గునిసినా, ఊరుకుంటారు.

నీల వచ్చింది. పెద్దరాణి యేమిటమ్మా విశేషా లన్నది. ఇంక నీల మొదలెట్టింది. దానికి మాటలు కొట్టిన పిండిగా! 'రాణీగారూ! రాణీగారూ! రాత్రి మా యింట్లో పెద్ద యుద్ధం జరిగింది.'

ఏమి యుద్ధం అనే ప్రశ్న అక్కర్లేదు. ఇంక నీలయే చెప్పుకోపోయింది. 'ఏమి యుద్ధం అనుకుంటున్నారు, కఱ్ఱ లేదు, కత్తి లేదు. తుపాకులు లేవు, యేమిటో ఒకటే యుద్ధం. నేను నిద్రపోతున్నాను. ఇదుగోనండోయి, రాణీ గారూ! ఆ యుద్ధంలో ఆడవాళ్ళుగూడా ఉన్నారు. ఆడవాళ్ళు గూడా యుద్ధం చేస్తారుటండీ? ఆవిడ యుద్ధం చేసింది. ఆవిడకి అటుయిటు పది చేతులున్నయ్యండి. పదోయిరవయ్యో నేను లెక్కపెట్టలేదు. నన్ను లెక్కపెట్టని స్తేగా. ఎప్పుడూ అటూ

యిటూ తిరుగుతుంది. ఒకవేపు తాలి నిల్చుంటుందా. నేను మూడు నాల్గు కాడికి వస్తాను. వెంటనే అటు తిరుగుతుంది. లెక్క ఆగిపోతుంది. యుద్ధానికేమిగానిండి ఆవిణ్ణి చూచి తీరాలండి. రాణీగారూ, మీకు కోపంవస్తుందేమోగానిండీ! ఆవిడముందర మీరెందుకండీ! యేమి నవ్వుతుందండీ! మా అమ్మ నవ్వుతుందిగాని అంత అందంగా మాఅమ్మ మిటి యెవ్వరూ నవ్వలేరు. మళ్ళీచూస్తే ఆవిడకు యెన్నో యేళ్ళుండవండీ. మా యింటిప్రక్క అమ్మాయి ఉంది చూడండి గంగ. ఆవిడకున్నన్ని యేళ్ళుంటాయండి. ఆవిడ కాళ్ళకు చేతులకి యెన్ని నగలున్నాయనుకున్నారు. మెడలో ఎన్ని నగలున్నయ్యనుకున్నారు. అన్నీ రత్నహారాలే. ముక్కుకి అడ్డబాసవుంది. మావూళ్ళో ఒక ముసలావిడ ఉంది లెండి! ఆవిడ ముక్కుకీ అడ్డబాస ఉంది. అందుకనే అడ్డ బాసంటే తెలుసు. ఆవిడ పేరు కౌసల్యమ్మ. ఆవిడంటే యేవిడనుకున్నారు. మా వూళ్లో వున్నముసలావిడండి! ఆవిడ అడ్డబాసచివర ఒక ముత్యం ఉంది. ఆ ముత్యం నల్లగా వుంటుంది. ముత్యం తెల్లగా ఉండదుటండీ! అది ముత్యం అని అందరికీ చెప్తుంది ఆవిడ. వట్టిదే. ఈవిడ ఉన్నదా ఈవిడ అడ్డబాస చివర ముత్యంకాదండీ? అది రత్నం అను కుంటాను. దానిలోంచి వెల్తురు వచ్చి మొగదంతా కమ్మేస్తే యింకో తమాషా చూశారూ! ఆ అడ్డబాస ముత్యంకాంది మళ్ళీ ముత్యం అంటున్నానేమిటి? రత్నం కాంతి, రత్నం కాంతో ఆవిడ నవ్వో తెలియకండావుంటుందండీ! అసలు యుద్ధంమాట మరచిపోయినా చూశారా! యుద్ధం అంటే

యిద్దరుమధ్య జరుగుతుందికదండీ! రాముడూ రావణాసురుడు వీళ్ళిద్దరు మధ్యా జరుగుతుంది. అదేమిటిలెండి యింకా చాలామంది మధ్య జరుగుతుంది. కంసుడు కృష్ణమూర్తి మధ్య గూడా జరుగుతుందిగా. నేనేమన్నా ఊరుకుంటా లేమండీ! కంసుడు కృష్ణమూర్తి మధ్యా జరుగుతుందా. కృష్ణమూర్తి జన్మించాడు; కంసుడు చంపటానికి వచ్చాడు. అసలక్కడ కృష్ణమూర్తి లేడుగా. కంసుడండి అక్కడ గుడ్డలమూట ఉందండీ దాన్ని ఎగరేశాడండి. అది పందిరి మీాద పడ్డదండీ! నాకు తెలియలా. మా అమ్మ నడిగితే చెప్పింది. అందులో మాయ ఉందిట. ఆ మాయ అన్నది. 'ఓరి! కంసుడా! కృష్ణమూర్తి రేపల్లెలో పెరుగుతున్నాడు. వాడు నిన్ను చంపుతాడులే అని' ఇంకేముంది? ఆ కంసుడికి గంగవెర్రులెత్తినయ్యండి! మా ఊళ్ళోనే పిచ్చిగంగమ్మిందండీ! ఆ గంగమ్మ నయం.'

అప్పుడు పెద్దరాణీగా రందిగదా 'అదేమిటే, నీలా యుద్ధం మరచిపోయినా' వన్నది.

నీల యిల్లా అన్నది:– 'అవునండోయి! అవునండోయి! మరచిపోయినానండీ! పెద్దదాన్ని కాదండీ! మరుపెక్కువ' (ఇవి వాళ్ళమ్మమ్మ అనేమాటలు.)

అప్పుడు చిన్నరాణి 'అంత పెద్దదానవా? నీ కెన్నేళ్ళన్న' య్యన్నది.

నీల నవ్వి 'యిల్లా మా అమ్మమ్మ అంటుందండీ! మరి యుద్ధంసంగతి చెప్పొద్దా. ఇటు ఈవిడ యుద్ధంచేస్తోందా అండి. అవతల యుద్ధంచేసేది మొగాడు. మొగాడేమిటి

దొర అండి. దొరకూడా కాదు. దొర అల్లే వుంటాడు. లాగూ చొక్కా కోటూ దొరటోపీ చేతిలో తుపాకి వుందనుకొంటాను. మళ్ళీ ఎంత పెద్దవాడనుకుంటున్నారూ! సిగ్గన్నా లేదు. అంత చిన్నపిల్లతో యుద్ధం యేమిటండీ! మహావుంటే ఆవిడకు పద్యాలుగేళ్ళుంటాయండి! నాకు బలే కోపం వచ్చింది లెండి! మా మామయ్య వ్రాసుకునే సిరాబుడ్డి ఉంది. అది తీసుకొని వెళ్ళి వాడినెత్తిన బోర్లించాను. ఇంతలో నాకు మెళుకువ వచ్చిందండీ.'

పెద్దరాణి:- 'ఇదంతా కలేనా ? నేను నిజం అనుకుంటున్నా.'

నీల:- ఇహిహి. ఎల్లా నిజమనుకుంటున్నారండి. ఎక్కడైనా ఆడవాళ్ళకు యిరవై చేతు లుంటాయా?

పెద్దరాణి:- 'మొగవాళ్ళ కుంటాయా?'

నీల:- ఉంటయ్యండి. మాయింటిప్రక్క ఒక అబ్బాయి యున్నాడు. ఆ అబ్బాయి బి. ఏ. ప్యాసయ్యాడండి, బియేనో యేదో తెలియదు. ఆయన పైనించి క్రిందకు నల్లని చొక్కా తొడుక్కున్నాడండి. దాంతో ఫొటోగ్రాఫు తీయించుకున్నాడుగా. మళ్ళీ నన్ను ముద్దాడుతాడు. నేను ప్రక్కన కూర్చుంటానంటే వీల్లేదన్నాడు. అతని నెత్తిన యేదో పలకల్లే ఉందండి! ఝామిటోను.'

పెద్దరాణి:- 'అతనేమిటి ? అతనికి యిరవై చేతులున్నాయంటావా?

నీల:- ఇరవై కాదండి, నాలుగు చేతు లున్నయ్యండి రెండు చేతులు ఊరికే వేళ్లాడుతున్నవండి. అసలు నాకప్పుడు

తెలిసింది. విష్ణుమూర్తికి నాల్గు చేతు లున్నయ్యని యన వచ్చుగా. అందుచేతే ఆవిడ కన్ని చేతు లున్నయ్యంటే ఊరుకున్నాను.

పెద్దరాణి:- ఊరుకోక యేం చేస్తావు?

నీల:- 'అవు నేం చేస్తాను. నిజమే అందుకనే ఊరుకున్నాను.'

ఇదంతా విన్నకొద్దీ భూదేవికి కోపం వచ్చింది. ఆవిడ వాళ్ళ నాయనమ్మతో అన్నదికదా ఇలాంటి బుద్ధిలేని మాటలు యెంతసేపైనా వింటారు మీరు. నేను వెళ్ళు తున్నా నన్నది.

పెద్దరాణి 'అది కాదమ్మా! మీ అమ్మగారికి నిండు నెలలు, ఆవిడి కుబుసుపోయేందుకు అప్పుడప్పుడు నీలను రమ్మంటాను' అన్నది.

భూదేవి వెళ్ళిపోయింది. పెద్దరాణి చిన్నరాణితో అంది 'నీవూ నీ భర్త కలిసి అల్లా పెంచారు పిల్లని. నీల మాటలు భూదేవికి అందంగా లేవు. యింకా యేమిచెప్పను.'

నీలకు కోపం వచ్చింది. 'యేమండీ! నావి బుద్ధిలేని మాటలా? బుల్లి రాణీగా రందిగదా, చూడండి మా మామయ్యతో చెప్పుతాను' అని.

రాచనెత్తురు చాలా చెడ్డది. ఈ మాటలలో తాత్పర్యం యేమీలేదు.

నీలయొక్క తక్కిన మాట లెల్లాంటివో యివి అల్లాంటివే కాని పెద్ద రాణిగారికి కోపంవచ్చింది. అన్నది 'మీ మామయ్య యెవరు? మీ మామయ్యతో చెప్పే

దేమిటి? యేం చేస్తాఢు మీా మామయ్య. నీవు యిల్లాగైతే మా కోటలోకి రావద్దు' అని.

ఆవిడకు కోపం నిజంగా రాలేదు. నీల అన్న ఆ మాటలు వింటూ మనస్సు కోపముఖంగా మరలింది. అదియొక స్వభావం.

నీలకు భయంవేసింది. కోటలోకి రాకపోతే యెట్లా? రావాలి. అక్కడి నిలువుటద్దాలన్నీ చూడాలి. బంగారపు కృష్ణు డున్నాడు. వాణ్ణి చూడాలి. బీరువాలల్లో రంగు రంగుల బొమ్మ లున్నవి. ఏనుగుదంతాలతో చేసిన బొమ్మలున్నవి. అవ్వన్నీ చూడాలి. పంజరాలల్లో పెట్టి దేవిడీముందర చిలకలు, గోరింకలు, మైనాలు ఉన్నవి. రోజూ వాటిదగ్గర గంటసేపు కాలక్షేపంచెయ్యాలి. వీటన్నింటికన్న వాకిట్లో ఒక చిన్న కొయ్యకు కట్టివేసి రెండు కోతు లుంటవి. వీటితో ఆడాలి. వాళ్ళ మామయ్యను వేధించి యేరోజుపడితే ఆరోజు ఒక కానీ గుంజి కోమటింటికి పోయి మరమరాలు కొని ఆ కోతులకు వెయ్యాలి. ఇంత కథ వుంటే కోటలోకి రాకండా ఎట్లా?

నీల బిక్కమొఖంవేసుకు కూర్చుంది.

కాస్సేపుండి చిన్నరాణీగా రందిగదా 'నీలా ! కోటలోకి రావచ్చులే ! మామయ్యతో చెప్తాను ? యిలాంటి మాటలు అనకూడదు' అని.

నీల:- అనను లెండి. కోటలోకి రానియ్యకపోతే మానె, కోతులదగ్గరకు రానియ్యండి.

పెద్దరాణీగారు ఒకొక్కప్పుడు చమత్కారంగా మాట్లాడుతుంది. ఆవిడ 'యే కోతులదగ్గరకు' అంది.

నీల వాకిట్లో ఉన్న కోతులదగ్గిరకొంది.

పెద్దరాణీగారు నవ్వింది. చిన్నరాణీ కొంచెం మొఖం ముడుచుకుంది. మరికొంత సేపటికి అందరూ నవ్వారు. నీలకు మొదటి చనువు వచ్చింది. అన్నదిగదా 'ఏమండీ మా మామయ్యతో చెప్పనన్నానుగదా. చెప్పానో లేదో మీ కెలా తెలుస్తుంది' అని.

పెద్దరాణీ అన్నది 'నీవు చెప్పితే చెప్పు; చెప్పుతానని బెదరించినట్లుగా ఇక్కడనకూడదు' అని.

నీల 'ఓహో! అదా!' అన్నది.

నీలకి దాని అర్థం తెలియలేదు. ఊరికే అన్నది. అన కూడదా అనిమాత్రమే ఆవిడ అర్థం.

రాజులు గొప్ప అన్నమాట. అల్లాంటి మాటలంటే వారి మర్యాదా చెడిపోతుందన్నట్లు వారనుకుంటారన్న మాట, అన్న అర్థం ఆ పిల్లకు తెలియదు. ఓహో! అదా! అనటంతోటే ఆ అర్థం పెద్దరాణీగారికి తెలిసింది. తెలవ టంలో ఆమె మాటలో ఒక్క వెక్కిరింపు ఉండటానికి వీలున్నట్లుగా గూడా తెలిసింది. మనస్సు చెడ్డది. దానిలో లక్ష పొరలు వుంటవి.

నీల బయలుదేరి వెళ్ళిపోతూ కోతులదగ్గర నిలుచుంది. కోటలో ఒక మూగ ఖాసా వాడున్నాడు. వాడు వట్టి మూగవాడే కాకుండా సగం పిచ్చివాడు కూడాను. ఊళ్లో పిల్లలకు రోజులో సగం పని వాడితో. వాడికి ఊళ్ళో పిల్ల లందరు విరోధం. నీల స్నేహం. ఎందుచేతనంటే నీల వాణ్ణి

చూచి ముక్కు గోక్కోడు. వాడితో కొంత కాలం గడిపి, నీల యింటికి వెళ్ళింది.

ఆ మూగవాడిపేరు శిలారు.

౯

శిలారుకి నీలకి వట్టి స్నేహమే కాదు. ఆ స్నేహంలో చాలా లోతులు వున్నవి.

నీలకి రోజుకు రెండుమూడు తక్కువలేకుండా కలలు వస్తవి. నీల తనకు వచ్చిన కలలు ఎవరితో చెబుతుంది ? వాళ్ళ మామయ్యతో చెప్పుదామా అంటే అతడు ఎప్పుడూ యింట్లో ఉండడు. మామయ్యా ! నీకు కల చెప్తాతా, రా అంటుంది. రాత్రికి చెప్పుదువుగానిలే అని నవ్వి సోమేశ్వరం ఏదో పనిమీద వెడతాడు. రాత్రికి, అంటే మామయ్య వచ్చేటప్పటికి నీల నిద్రపోతుంది. కాదని బలవంతంగా కూర్చుంటుందనుకో; ఆ వెనుకటిరోజున పెందలాడే వచ్చిన మామయ్య ఆ రోజున ప్రొద్దుపోయి వస్తాడు.

ఇంక వాళ్ళమ్మతో చెప్పాలి. వాళ్ళమ్మ చేస్తే జపం చేసుకుంటూ ఉంటుంది. లేకపోతే యింట్లో యేదో పని చేస్తూవుంటుంది. నీలే విసుగుపుట్టి ఒక్కొక్కప్పుడు పని చేసుకుంటూన్న తల్లి వెంటబడి దొడ్లోనుంచి ఇంట్లోకి ఇంట్లోంచి దొడ్లోకి ఆవిడ వెంటనే వెళ్ళుతూ వస్తూ కథ చెపుతూ ఉండాలి. తీరా కథంతా చెప్పింతర్వాత చివరకు వాళ్ళమ్మ ప్రశ్న వేస్తుంది. ఆ ప్రశ్న వినటంతోటే నీలకు తెలిసిపోతుంది, మొదటినుంచి వాళ్ళమ్మ కథ వినలేదని.

ఇంక వాళ్ళమ్మమ్మ ఉంది. ఆవిడ మనమరాలు చెప్పే కథని స్థావకాశంగా వింటుంది. విని ఆశ్చర్యపోదేం? అయ్యో అల్లాగా దేవతలకు కొందరంటే యిష్టం. ఆ దేవతలు గెల్చారని చెప్పితే వాళ్ళమ్మమ్మ సంతోషపడదు. వాళ్లు ఓడారంటే దుఃఖాపడదు. అందుచేత వాళ్ళమ్మమ్మకు చెప్పటంలో నీలకేమీ ప్రయోజనం కన్పించలేదు.

ఇంక ఎప్పుడైనా కోటలోకి పోతే పెద్దరాణీగారు, చిన్నరాణీగారు వింటారు. ఆ విన్నా ఒక్కొకల చెప్పేటప్పటికి యింక చాలులే వెళ్ళు అంటారు.

ఇంక పొరుగు పిల్లలున్నారు. వాళ్ళు గచ్చకాయలాడుకోను, గోడీబిళ్ళలాడుకోను. ఈవరస చివరికి నీలకి తన కలలన్నీ చెపితే వినేవాడు, విసుగులేనివాడు, సరిగ్గా తనకు మల్లే అనుకునేవాడు ఒక్క శిలారు కనబడ్డాడు.

వాడికి మాటలురావు. అందుచేత ఒక్కొక్కప్పుడు చెప్పిన విషయమే నాల్గు, అయిదుసార్లు చెప్పాలి. ఒక్కొక్కప్పుడు కలలో తాను చూచినది అభినయించి చెప్పాలి. అందుచేత ఈ చెప్పటం నీలకు మరీసరదా. ఒక్కొక్కరోజున తమ దేవతలు ఓడిపోతారు. అప్పుడు నీలా శిలారు కూర్చొని యేదో పెద్ద విచారిస్తూవుంటారు. మాటాలేదు, పలుకూలేదు. అప్పుడు వాళ్ళిద్దరిని చూస్తే వాళ్ళిద్దరిని ఎరిగినవాళ్ళు వెక్కిరిస్తారు. ఎరుగనివాళ్ళు యేదో పెద్ద ఆపద మూడిందిరా అనుకుంటారు.

అయితే శిలారు - పేరును పట్టే తెలుస్తుంది - మహా మన్దీయుడు. తల్లీదండ్రీ వాని చిన్నప్పుడు కలరా వచ్చి

చచ్చిపోతే అతన్ని కాపులు పెంచారు. అందుచేత అతనికి హిందువుల దేవుళ్లే దేవుళ్ళు. నవరాత్రిపండుగలు వస్తే తాను శక్తివేషం వేసుకుంటాడు. ఆంజనేయులువారిగుళ్ళోకి వెళ్ళి కొబ్బరికాయలు కొడతాడు. అతన్ని చూస్తే ఎవరూ సాహెబు అనుకోరు.

ఒకరోజున నీల అతనితో తన కల చెప్తోంది! 'ఇదిగోనోయ్! శిలారు! రాత్రి ఆంజనేయులువారున్నారే'

శిలారు:- ఊఁ. ఊఁ.

నీల:- రావిచెట్టుక్రింద దేవుడు. కోతిమొఖం. యిల్లా రెండుకాళ్ళు పెట్టి ఒకచేతితో గద ఉంటుంది. ఒకచేతిలో పర్వతం ఉంటుంది.

శిలారు తెలిసినట్లు తలవూపి బుగ్గలు ఉబికించి కళ్ళు పెద్దవిచేసి తాను నిలుచుండి తన వెనుకనుండి చేతితో యిల్లా గుండ్రంగా పైకి తీశాడు. అది తోక అన్నమాట.

నీల:- ఆ. ఆ. ఆయన.

ఆయనకిన్ని యిదివరకు చెప్పలా దొర? దొరటోపీ లాగూ కోటూ గుండీలు యివన్నీ- నీల అభినయంచేసి చూపించి మళ్ళీయిల్లాఅన్నది. ఈయిద్దరికి పెద్దయుద్ధంజరిగింది.

ఈ కథ మొదలుపెట్టగానే నీలకి శిలారుకి యిద్దరికి మహాఉత్సాహం పుట్టింది. ఎందుచేతనంటే ఆంజనేయులుతో ఎవ్వరూ యుద్ధంచేసి గెలువలేరని వాళ్ళఉద్దేశ్యం. ఇతర దేవతలు రావటం తమదేవతల్ని గెలవడం వీళ్ళిద్దరూ దుఃఖ పడడం, ప్రతిరోజూ చివరకి నీల అనటం 'ఇల్లా కాదోయ్!

ఈదేవతలు ఆంజనేయులువారితో పోట్లాడాలి అప్పుడు తెలుస్తుంది' అని.

ఇల్లా అనుకోగా ఇన్నాళ్ళకి ఆంజనేయులుగారు యుద్ధంలోకివచ్చాడు. అందుచేత మహాఉత్సాహంగా ఉంది. ఇతర దేవతలు ఓడిపోయినారని నీల మళ్ళీ మొదలుపెట్టింది. ఆ ఆంజనేయులువా రేం చేశారంటే, ఆదొర లేమా దొరంటే దొరకాదు. దొరల్లే ఉంటాడు. మీసాలుంటయి. ట్రాపిం గుంటుంది. తెల్లని పట్టుచొక్కా తొడుక్కుంటాడు. సిగరెట్లు కాలుస్తాడు. మొఖాన బొట్టుండదు. ఆ దేవుడు, వా డేం చేశాడో తెలుసునా ? ఆయనచేతిలో టుపాకీ ఉందోయి. ఆ టుపాకీపెట్టి ఆంజనేయులువార్ని కాల్చాడు.

శిలారు 'ఆఁ' అన్నాడు.

నీల కాల్చాడు అని, కళ్ళు పెద్దవిచేసింది.

శిలారు లేచి ఒక గంతువేసి ఎడమ అరచేతిలో కుడిచేయి గుప్పిలిపట్టి ఒక్క దెబ్బ కొట్టి ఊఁ అన్నాడు.

నీల నవ్వింది. అంతే జరిగింది. అంతే జరిగింది అంది. టుపాకీపెట్టి కాల్చాడా, ఆంజనేయులువారు తన తోకతో టుపాకీని లాగేశాడు. ఆబాటున ఆ దేవుడు క్రిందబడ్డాడు. దేవుడుగుళ్ళో పూజారి సింధూరం లేదూ ఎర్రగా వుంటుంది అని నీల ప్రక్కనున్న గోడకు వేలురాచి ఎడమ అరచేతిలో రంగరించి బొట్టు పెట్టుకున్నట్లు నటించింది.

నటించి యిల్లా అన్నది. ఆ పూజారి ఆ దేవుడికి ఎర్ర బొట్టు పెట్టాడు. దాంతో ఆ దేవుడు ఏం జేస్తాడు తుపాకి యేమో పనిచేయదాయె తాను క్రిందపడిపోయె. మొఖాన

చెరిపితే పోదాయె. అది సింధూరం కాదు. నూనెతో రంగ
రించి పెడతారాయె. ఇంతలో మా అమ్మ నన్ను నిద్ర లేపింది.

ఈ కథ అయినతరువాత వాళ్ళిద్దరికి ఆరోజున పట్టాభి
షేకం అయినట్టుగా ఉంది. నీల వెళ్ళిపోయింది. శిలారు పట్ట
రానంత ఉత్సాహముతో కోటలో తిరుగుతున్నాడు.

శిలారుకు కోటలో ఏమీ పనిలేదు. ఆతనితో ఎవళ్లూ
యేమి పని చెప్పరు. ఒకపని చెయ్యమంటే యింకోటిచేస్తాడు.
యేది చెప్పినా తెలియనట్లుంటాడు. అతనికి తెలిసినది ఒక్కటే.
నిన్ను త్వరగా రమ్మంటున్నారు అని చెపితే ఆ ఒక మాట
చాలా బాగా తెలుస్తుంది. ఆ దొరగారు అంటే అతనికి
ప్రాణం. అతని దృష్టిలో తెలిసినవి రెండే విషయాలు.
దేవుడుగుళ్లో ఆంజనేయులున్నాడు. కోటలో దొరగా
రున్నారు. పెద్దరాణీగారు చిన్నరాణీగారు దివాను వారేమిటి-
ఎవ్వరన్నా అతనికి లేదు. రాణీగారు పిలుస్తోందని చెపుతారు
ఎవరన్నా. అతడు చెయ్యి విదలించి మూగసణుగుడు సణుగు
తాడు. వాడికి అపరిమితమైన తెలివి తేటలు. బోలెడంత
అమాయకత్వం. ఒకదాని కొకటి పొసగని ఈ రెండు గుణాలు
సమృద్ధిగా ఉన్నవి. వాడి అమాయకత్వం వాడి వెర్రి అంతా
వాడు మూగవాడని యివతలవాళ్ళు లెక్కలేకుండా ఉన్నట్లు
ప్రవర్తించాలని ప్రయత్నించడం. యిలాంటివి చేస్తే వా
డఖండమైన తెలివి చూపిస్తాడు.

ఈ వుత్సాహంలో వుంటే దొరగారు రమ్మంటున్నా
రని చెప్పారు. యింకేమున్నది. రాములవారు రమ్మంటే
ఆంజనేయుడే వెళ్లాడు. నిజానికి దొరగారతనిని రమ్మనలేదు.

వాడికి దొరగారిదగ్గర ఎవ్వరికి లేనంత చనువు. జమీందారు గారు ఊరకే కూర్చుండిఉంటాడు. యితడు ఊరికినే వెళ్ళి ఆయనకాళ్ళు పిసుకుతూ ఉంటాడు. ఆయన అడగకుండానే ఆయన సామాన్యంగా వాడుకునే వస్తువుల్ని అందిస్తాడు. ఆయన తొడుక్కున్న చొక్కామీద ఏదైనా పురుగు వాల్తుంది. యితడే వెళ్ళి తీసివేస్తాడు. యేవో మూగమాటలు మాట్లాడుతాడు. ఆయనకు శిలారుఅంటే సరదా. ఎందుచేత నంటే జమీందారు స్వతస్సిద్ధంగా నాగరికుడు. అయినా కొన్ని పాత జమీందార్ల లక్షణాలున్నవి. అంటే ఏదైనా ఒకఊహ పుడుతుంది. ఆ వూహ విపరీతంగా ఉంటుంది. దానివల్ల తనకేమీ ప్రయోజనం లేదు. ఎదటవాడికి బాధ కలిగించవచ్చు, అదంతా లేదు; చేసివేయటమే!

శిలారుకు ఒక్కగుణం వుంది. అతను గొప్ప తిండి పోతు. పదిమందికి చేసినవంట వాడొక్కడూ తింటాడు. వీడి ఈగుణం చూసే జమీందారుగారికి మహాసరదా. ఆయనకేమీ పని లేనప్పుడు యేమీ తోచకపోతే శిలారును పిలిపించడం. బజారునుంచి ఏవో తెప్పించడం, లేకపోతే దివాణంలో చేయించడం, వాడికి పెట్టించడం. చేసినదంతా వాడు తినాలి. లేకపోతే చావాలి. కొంత తిన్నతరువాత వాడు కడుపు నిండిందని అభినయంచేస్తాడు ఇంకా తినిపించ డానికి ఒకమందు ఉంది. 'శిలారు! నువ్విదిగూడా తింటావా నీకు పెళ్ళి చేస్తాను. మంచి పిల్లను తీసికొస్తాను. మీ సాయి బులపిల్లనే తీసుకుని వస్తాను' అని జమీందారుగారు నవ్వ కండా నిజంగా చెప్పినట్లు చెప్పాలి. వాడికి పెండ్లి అంటే

పెద్దఆశ. వాణ్ణి అనేకసార్లు ఊళ్ళో చాలామంది పెళ్ళిచేస్తా మని యేపనులుపడితే ఆపనులు చేయించుకుంటారు. అతను పెద్ద బలశాలి. ఎంత మొద్దుపనైనా చేస్తాడు.

ఇప్పుడు శిలారు జమీందారుగారిదగ్గరకు వచ్చేటప్ప టికి జమీందారుగారు ఒకగదిలో ఉన్నారు. ఆగదిలో నాలుగయిదు తట్టల లడ్డూలు వున్నవి. కోటలో నీళ్ళకి యిబ్బందిగా ఉంటే జమీందారుగారు పెద్దభావి త్రవ్విం చాడు. ఆ భావిలో ఎడతెగని జల పుట్టింది. ఇంజనీర్లన్నారు గదా యింజను పెట్టిస్తే ఊరందరికి సప్లయి అవుతుందని. అందుచేత జమీందారుగారు నుయ్యిత్రవ్విన పనివాళ్ళకు కోటలోని సేవకులకు పంచిపెట్టడంకోసం లడ్డూలు తెప్పించారు జమీందారుగారు శిలారును చూడడంతోనే ఆ లడ్డూలు పంచిపెట్టడానికి తెచ్చామని మరచిపోయినాడు. నల్గురు కాసావాళ్ళని పిల్చి నవ్వుతూ ఈ లడ్డూలు శిలారు తినటా నికే తెప్పించామన్నాడు. శిలారు మొఖమాటంగా వద్దన్నాడు. కాని తినకతప్పింది కాదు. ఎట్లాగయితేనేమి, ఒక తట్టెడు లడ్డూలు తినిపించారు. వాడికి వెళ్ళుకొస్తోంది.

జమీందారుగారు ఊరికే పగలబడినవ్వటం. వాడిచేతులు కట్టెయ్యమన్నారు. వాడినోట్లో లడ్డూలు కుక్కుతూఉన్నారు. వాడు మింగలేక మింగలేక మింగుతూ ఉన్నాడు. చివరకు సోక్కున్నాడు. జమీందారుగారు నవ్వుతున్నారు. లడ్డూలు మళ్లీకుక్కించారు. మధ్యమధ్య జమీందారుగారు అంటారు కాసాలు అంటారు నీకు పెళ్లిచేస్తామో అని. చివరకు వాడు

చచ్చిపోవటమా, లడ్డూలు కుక్కటం మానేయడమా అనే కాడికి వచ్చింది.

ఇంతలో వాడి కాయుర్దాయం తిన్నగా వున్నది కాబోలు! జమీందారుగారు వేరే యేదోపనిమీద వెళ్ళిపో వలసివచ్చింది. నూతిలో నీటిజల పొంగివస్తోంది. పైకివచ్చిం దట. నీళ్ళకు వినియోగం లేకపోతే క్రమంగా నీరుపొంగి కోటంతా ప్రవాహం కావచ్చన్నారు. ఆ జల కనుక్కొని దాన్ని సగం మూస్తేకాని ఈ ఆపద తప్పదన్నారు. జల కనుక్కోటానికి జల వచ్చే చోటు నీళ్ళక్రింద ఉండిపోయింది. యేమి చెయ్యాలో తెలియలేదు. తెల్లవారేటప్పటికి నీరు కోటలో నిలచింది. శీలమండలములోతు. మోకాటిలోతు. యిట్లా పెరుగుతోంది. యేమీ తోచిందికాదు. చివరకు కోట వదలిపెట్టి పోవాలా అనిపించింది. పెరిగి పెరిగి ఎంతవరకు పెరుగుతుంది? కోట అంతా ముంచి, ఊరంతా ముంచి, దేశ మంతా ముంచుతుందా?

## ౧౦

ఈ ఆపద దాటాలీ అంటే అనేకమంది అనేకవిధాలుగా చెప్పటం మొదలుపెట్టారు. అన్నింటికన్న ప్రస్తుతమయిందీ చాలా అవసరం అయిందీ ప్రస్తుతం నీళ్లు తోడించిపోయటం. ఆ పని చేస్తున్నారు. జల కట్టటం ఎల్లాగా?

ఉద్యోగస్తులు తక్కినవాళ్ళూ యింజనీర్లను పంపించా లని మరి యేదో యితర మానుషములైన ఉపాయములు చెపుతూంటే ఒకటి రాణివాసం రెండు బ్రాహ్మలు వీళ్ళందరు

కలసి వేరే ఉపాయాలు చెప్పటం మొదలుపెట్టారు. రాణి వాసంలో ఒక మాట పుట్టింది. తిరుపతి వెంకటేశ్వరుల మొక్కులు చెల్లించలేదు. కోటలో అన్నీ దురాచారాలు జరుగుతున్నవి. స్వామికి కోపంవచ్చింది. స్వామికి మొక్కుకుని లెంపలు వాయించుకొని ఏదో చేస్తేనేగాని స్వామికి కోపం తీరదని. ఈ మాటలు మొట్టమొదట పెద్దరాణీగారివి. అవి మొట్టమొదట విన్నది జమీందారుగారు.

ఆవిడ పదే పదే ఆమాటలే అనటంమూలంగా రాజా గారికి కోపం వచ్చి ఏమి టీ దురాచారాలు అన్నాడు.

రాణీగారు యిలా అన్నది. దురాచారాలు గాదా మరి. పసిబిడ్డను మిస్సమ్మల పెంపకమేమిటి? మొన్నమటుకు మొన్న పిల్లవాడు పోరుపెట్టి ఏడుస్తూంటే దృష్టితీసినా లాభం లేదాయె. మొక్కుకున్నా లాభం లేదాయె. ఏదైనా మాట్లాడితే వాళ్ళ మొక్కు పరిశుభ్రత మనకు లేదంటావు. ఏమి పరిశుభ్రతయ్యా స్నానంచెయ్యని పరిశుభ్రత. యింకా యేమైనా అంటే నీకు కోపం వస్తుంది. ఆవిడ మొగమైనా కడుక్కోదాయె. ఇంక ఏమిటయ్యా అంటే తెల్లగా యిస్త్రీ చేసిన మడతలు కట్టుకుంది. పైకి శుభ్రంగా ఉంటుంది. శుద్ధి రెండు విధాలు; అంతఃశుద్ధి, బహిశ్శుద్ధి అని. అంతఃశుద్ధి లేదు. బహిశ్శుద్ధికి పాటుపడుతున్నావు అన్నది.

జమీందారుగారు ఎంత కోపంవచ్చినా తల్లిగారికి ఎదురు చెప్పని సద్గుణం ఒకటి ఉన్నది. ఆయన వెళ్ళిపోతూ భార్యవంక చూస్తాడు. ఆవిడముఖంలో అత్తగారి పక్ష మవలంబించిన రేఖలే అగుపించినవి. అందుచేత తల్లిగారి

మీాద కోపము అంతా భార్యగారిమీాద వచ్చింది. ఆపాటున వెళ్ళిపోయినాడు.

జమీాందారుగారిక్కి ఊళ్ళో పురోహితవంశాలు పది ఉన్నవి. వాళ్ళందరూ కోటలోకి వచ్చారు.

'దొరగారు ! జపాలు చేయించండి. చేయిస్తే గాని యీా బెడద తప్పదు. అగ్నిబుక్కులు, అగ్నిమంత్రాలు పఠిస్తే ఈ జలప్రవాహం కడుతుంది' అన్నారు.

రాజాగారిక్కి అంతకంటె మూర్ఖత ఉందనిపించింది. నీళ్ళు వచ్చేమార్గం కట్టేటట్టు చూడాలిగాని మంత్రాలకు వీటికి ఏమి సంబంధము అనిపించింది. కాని ప్రభువుగారు వారి మనస్సులో ఏమనుకున్నారో ఎలా తెలుస్తుంది. పైకి అనరుకాని రాజోద్యోగులలో కొందరు సరిగ్గా వ్యాధి యెక్కడుందో తెలసిన వైద్యునివలె రాజుగారి ఊహను అల్లా ఆకట్టివేస్తారు. అటువంటి ఒకాయన అన్నాడుగదా 'మంత్రా లకు వీటికి ఏమి సంబంధమయ్యా ? జపాలు చేయిస్తే బ్రాహ్మలు తినవచ్చని చూస్తున్నావు' అన్నాడు.

ఈ సందర్భములో సోమేశ్వరం అక్కడ ఉన్నాడు. ఆపత్కాలం అన్ని అభ్యంతరాలకు మొఖమాటాలకు స్వస్తి దలలకు పాటింపు లేనికాలం. అందుచేత కోటలోకి అందరితో పాటు అతనూ వచ్చాడు. ఆ సమయంలో దేవిడీలోకి మన్నాలు గైరుహాజరు.

సోమేశ్వరం:- మంత్రాలకు దీనికి ఏమి సంబంధం అంటారు. ఏమి సంబంధమో చెపితే నీకేమి తెలుస్తుంది?అని.

రాజాగారికి సోమేశ్వరం అంటే మొదటి కోపం పోయింది. అతడు తన కాగితం యిచ్చేసింతరువాత క్రమ క్రమంగా సోమేశ్వరంవల్ల తనకు జరిగిన ఉపకారం వాళ్ళు చెప్పగా వీళ్ళు చెప్పగా తెలిసింది. నచ్చింది. నిజమేననిపించింది. దానితో సోమేశ్వరం కోటలోకి రావటం అతను ఇలా అనటం ఈ రెండు రాజు ఓర్చగలిగాడు. ఓర్చుకోటమేగాదు పైకి అలక్ష్యంగా అనిపించినా లోపల ఏం చెబుతాడో చూద్దామనే భావంతో ఏమిటా సంబంధం అన్నాడు. అనేటప్పుడు సోమేశ్వరంవంక చూడలేదు.

సోమేశ్వరం తక్కువ తిన్నాడా. అతను జమీందారుగారి వంక చూడకుండానే సమాధానమిచ్చాడు. 'మాట అంటే ఏమిటి? వెనుకనున్న భావము. ఆ మాటకు అర్థం ఉంది. ఈ అర్థం ఏమిటి? ఆ వెనుకనున్న భావమే; దీనికి అర్థం ఒక మాటంటే దానికి భావం ఉంటుందికదా ! భావమంటే ఒక క్రియ జరగటాన్ని గూర్చినది. ఆ జరగటం రెండు రకాలు. ఒకటి మనస్సులో జరగటం రెండు లోకంలో జరగటం. మనస్సులో అనుకోటంతోటే జరిగినట్లే. ఆ భావం మాటలద్వారా చెప్తాము. ఆ చెప్పినది ఒక్కొక్కప్పుడు మనమే చేస్తాము. ఒక్కొక్కప్పుడు ఎవరిచేతనైనా చేయిస్తాము. చేసినతరువాత ఆ పని చేయబడినది అనిపిస్తుంది. సర్వకార్యాలు చేతులతో చేస్తాగా ? క్రియారూపంగానే జరుగుతాయా ? ఒక్కొక్కప్పుడు మాటలతోనే జరుగుతాయా? ఒకనికి ఒక మాట అప్పచెపుతాము అంటాం. వాడు మనకేదో అపకారం చేసాడు. నీ విట్లా చేశావు అని వాని ఎదుట

ఉద్ఘాటిస్తాము. అప్పుడు ఒక పని జరిగినట్లు అనగా అతని మనస్సు ఆ విషయంలో ఆ భావాన్ని స్ఫురింపచేటట్లు చేయటం. ఇది వాక్సంబంధమైన క్రియ. క్రియ అనేది ఎప్పుడూ కర చరణాద్యవయవములతోనే చెయ్యాము. మనము వాక్కుని ప్రయోగిస్తే దాని ప్రతిఫలం అంతటితో ఆగక మనోగోళంలో కలిగింది. ఆ కలిగిన ప్రతిఫలం అంతటితో ఆగక వాడు బుద్ధిమంతుడైతే మనకు చేసిన అపకారం తప్పని తెలిసికొని ఆ అపకారం ఉపకారంగా లౌకిక ప్రపంచంలో చేయవచ్చు. అందుచేత మాటకు ప్రతిఫలం క్రియ అనేది లేకుండానే క్రియాజగత్తు జరగవచ్చు. ఇదంతా వట్టి లౌకికపు మాటకు కూడా అట్టి ప్రతిఫలం ఉంటుందంటానికి చెప్పాను.

'సామాన్యపు మాటలకు ఈ శక్తి ఉండగా మంత్రాలకు ఎందుకు ఉండదు? అని మహర్షులు చెప్పినమాటలు. అది గొప్పా? అని ప్రశ్న వేస్తారు. గొప్పే. ఒకడు చెప్పినమాట కన్న ఇంకొకడు చెప్పినమాట గొప్పకాదా? సేవకుడు తానే చెప్పిన మాటకన్న దొరగారు యిలా చెప్పారు అన్న మాటకు విలువ ఎక్కువ. అసత్పురుషుడు చెప్పిన మాట కన్న సత్పురుషుడు చెప్పినమాటకు విలువ ఎక్కువ. అల్లాగా ఆ సత్పురుషులందరిలో సత్పురుషులైన మహర్షులు చెప్పిన మాటల కెక్కువ శక్తి ఉంటుంది. వారి వట్టిమాటలకన్న వారి మంత్రాలకు ఎక్కువ శక్తి ఉండాలి. ఇది సామాన్యతర్కం.

'ఇక సందేహమేమిటంటే, ఆ మంత్రాలకు లోకంలో పాంచభౌతికమైన జగత్తుకు సంబంధం ఉంటుందా ? అని. ఉంటుందని తార్కికంగా ఋజువుచేయవచ్చు. తార్కికంగా

ఎందుకు, పట్టి ప్రత్యక్షంగా చూపిస్తాను. మా స్నేహితు డొక డున్నాడు. వాళ్ళ యిల్లు ఎక్కడో ఊరిబైట వున్నది. అక్కడ పాము లెక్కువ తిరుగుతూ ఉంటవి. అతనికొడుకు ఒకరోజున రాత్రి ప్రొద్దుపోయి యింటికి వస్తున్నాడు. ఏదో పాము కరచింది. ఆనా స్నేహితుడు లౌకికతర్కవాది. అప్రత్యక్షాలైనవి ఏవీ నమ్మడు. సంఘసంస్కారి మనపూర్వ విశ్వాసాలన్నీ మూఢ విశ్వాసాలంటాడు. అతడికొడుకును ఆస్పత్రికి తీసుకువెళ్లాడు. ఆస్పత్రిలో వాళ్ళేమన్నారంటే యేమీప్రయోజనం లేదండీ! మామందులేమీ పనిచెయ్యవు. వేయమంటే వేస్తాము. యింతకంటె రైలుస్టేషనకు వెళ్ళి పాములనర్సయ్యకు టెలిగ్రాం యివ్వండి అన్నారు. అతనికి విశ్వాసం లేదు. కొడుకు స్మృతిలేకుండా పడిఉన్నాడు. పెదవులవెంట నురుగులుగక్కుతున్నాడు. ఆవిశ్వాసం కొడుకు ఆస్థితిలోంచిపుట్టింది. అసలు విశ్వాసస్వరూప మది. రైలుస్టేషనుకు వెళ్ళి టెలిగ్రాం యిచ్చారు. మళ్ళీ టెలిగ్రాం వచ్చింది ఫరవాలేదు, పిల్లవాడు లేచి కూర్చుంటాడు అని. ఈవార్త రావటంతోటే పిల్లవాడు లేచి కూర్చున్నాడు. లేచి కూర్చుండేందుకు రెండునిమిషాలు పట్టలేదు. కూర్చున్నపిల్లవాడికి నురుగులులేవు. అంతస్మృతి హఠాత్తుగా యెలా వచ్చింది, అతని రక్తంలో వ్యాపించి ఉన్నసర్పవిషానికి ఇంతదూరానికి ఆమాటకు ఏమిసంబంధం? నాస్నేహితుడు తరువాత తలక్రిందయినాడు. తరువాత నాలుగురోజులకు నావద్దకు వచ్చాడు. ఇదంతా చెప్పాడు ఏమోయి సోమేశ్వరం! నేను పూర్వము ఇవేమి నమ్మే

వాడనుగాదు. నాకు యిదంతా చూస్తే అన్నీ నమ్మక, తప్పక వచ్చేటట్టుంది అన్నాడు.

'నేనన్నానుగదా; బుద్ధిమంతుడవుగనుక ఈమాత్రం అన్నా అంటున్నావు. యిది కాదంటే చేసేదేమున్నది. నీ కొడుకేమో బ్రతికాడాయె. ఆ మంత్రం లేకపోయినా ఆవేళ కెట్లాగు వాడు లేచి కూచునేవాడే అంటే నేనేంచెయ్యాలి. ఇంకోటి చూడు. ఈటెలిగ్రాంలన్నీ ఏమిటో తెలుసునా? ఎవడో పాశ్చాత్యుడు రైల్వేలో గొప్పఉద్యోగి. అతనికి పాము కరచిందట. నర్సయ్య మంత్రంతో నిమ్మదించిందట. అప్పటినుంచి ఈఏర్పాటు చేశాడట. అవిశ్వాసమంటేమూర్తి కాంచిన ఆదేశాలల్లో ఉన్న ఒకడు ఈ పనిచేశాడంటే మంత్రంలోగూడా శక్తిఉంటుంది అని నమ్మాలి'.

'దానికది నమ్మి తక్కినవాటిజోలికి పోకుండా ఉండటం మధ్యముడు చేస్తాడు. ఉత్తముడు దీనినిబట్టి యితరములైనవికూడా ఆలోచిస్తాడు. ఇంకోటి చూడండి, రేడియో చూస్తున్నాంగదా. మార్కోని (Marconi) దీనిని మొదట ఎట్లా కనిపెట్టాడు? స్వరశబ్దము వాయువీధులలో ప్రసరిస్తూ ఉంటుందనేకదా. అతని వివేక మేమిటంటే ఆశబ్దాన్ని కొన్ని ద్రవ్యాలు, రాయి, ఇత్తడి మొదలయిన తీగలెవో ఆ యంత్రం. ఒకపద్ధతియైనచేత. ఈ యంత్రంలో ఏర్పరచిన ద్రవ్యపరికరాలకు ఆశబ్దతరంగం ప్రసరణానికి ఏమిసంబంధం? ఆ సంబంధం యిట్లాంటిదని తెలుసుకొని ఆయంత్రం అట్లాంటిదిగా తయారుచేశాడు. అందుచేత సంబంధం ఉన్నదన్న మాట. ఈగ్రాహకయంత్రం లేకపోయినా సంబంధంఉన్నది.

ఈ గ్రాహకయంత్రం మనము వినేందుకు ఉపకరించే ఉపకరణం. ఆశబ్దతరంగాలు గాలిలో జరిగే ఒకానొక క్రియా విశేషానికి ఎవరు అడ్డుపెట్టగలరు?'

'అట్లాగే మంత్రాక్షరాలు గాలిలో ప్రసరిస్తయి వానిపని అవిచేస్తవి. చేయవు అనటానికి మనుష్యుడికి ఊహాశక్తి లేకుండా ఉండాలి. ఆఊహాశక్తి లేకపోవటమే నాస్తికత్వం అంటారు. నాస్తికత్వం అంటే చెప్పాను కాదు. ఊహాశక్తి లేకపోవటం, సరియైన పద్ధతిగా విచారణచేయకపోవటం అన్నాడు.' ఊరుకొన్నాడు.

జమీందారుగారు ఏమీ మాట్లాడలేదు. మాట్లాడకపోవడం వారు అంగీకరించటం కనీసం అల్లా చేస్తే చెయ్యనివ్వండి ఫలితం కలిగితే అనిష్టం కాదుకదా అనటం. ఒకవేళ ఫలిస్తుందేమోనని ఆశగూడాపడడం.

రాజుగారినోటితో అనకుండానే యితరుల ఆజ్ఞలచేత బ్రాహ్మలు వచ్చి జపాలు మొదలుపెట్టారు.

ఇంతలో పసిపిల్లవానిదాదియైన మిస్సమ్మ పదిరోజులు శలవు కావాలంది. ఆవిడ వెళ్ళింది. వెళ్ళడంతోటే పెద్ద రాణీగారు కోటలో చేసిన హంగామా అంతూపంతూ లేదు. పాత్రిళ్ళగుడ్డలదగ్గరనుంచీ తడిపి యెండేయించింది. ఆవు పంచితం తెప్పించి కోటంతాచల్లించింది. అది శనివారం అత్తాకోడళ్ళిద్దరు ఉపవాసం. తిరుపతివెంకటేశ్వరుడికి క్రొత్తముడుపులు, క్రొత్తమొక్కుబోటాలు, బ్రాహ్మలకు దానాలు. అంతా పూర్వం జమీందారుగారు బ్రతికివున్నట్లు జరిగింది.

జమీందారుగారు యింత జరుగుతూవుంటే మాటాడ

కుండా ఊరుకున్నారు. ఆరోజున జమీందారుగారి భోజనం పాతపంపిణీమీద జరిగింది అంటే ఈ రోజుల్లో ఆయనభోజనం చేస్తూవుంటే సూటు వేసుకుని బల్లమీద తింటాడు. ఇవ్వాళ భోజనానికి సువారంలోకి రమ్మన్నారు. స్నానం చేశాడు. పంగనామాలు పెట్టుకున్నాడు. చాకలిది ఉతికి తెచ్చిన మడత విప్పి కట్టుకుని చొక్కా లేకుండా పీటమీద కూచొని భోంచేశాడు.

కోటఅంతా మారిందిగాని మారనిది ఒక్కవ్యక్తి ఆవిడ రాజుగారి కూతురు. ఆవిడయొక్కపాశ్చాత్యస్త్రీతనం అవధికి మీరిపోయింది. ఆవిడ గారాబానికి అది పరమపరీక్ష. ఆ గారాబం ఆపరీక్షను తట్టుకుంది.

ఇంతచేస్తే పాపం! ఆ వేదానికి మంచిరోజులు ఆ తిరుపతి వెంకటేశ్వర్లుకి అదృష్టపు దినాలు సోమేశ్వరునికి కొంచెం మంచి ఘడియలు. మూడవరోజుకి బావిలోని జల కట్టింది. కోటలోని నీరు తీసింది. తీసినతర్వాత మళ్ళీ పుట్టి వ్యాఖ్యానాలు యథాప్రకారమే.

౧౧

అంతటితో చక్కగా సరిపోయేది, కాని కొన్నియేండ్ల నుండి రాజుగారు వద్దంటున్నది, పెద్దరాణీగారు చిన్నరాణీగారు అల్లా మొక్కుకోక తప్పదన్నది, ఈ జల కోటంతా ఆక్రమించినప్పుడు పెద్దరాణి, చిన్నరాణి మొక్కుకోనే మొక్కుకున్నారు. ఆ మొక్కు ఏమిటంటే జమీందారుగారి కుమార్తె పెండ్లి అవడంతోటే చిన్నరాణీగారు వెళ్ళి నిలువు

దోపిడి యిచ్చి రావటం. అల్లా యిస్తే ఒప్పుకోనని రాజా గారు. స్వామికి మనం యిన్ని అపచారాలు చేశాం; దీనితో గాని స్వామికి కోపం తీరదు అని వారిద్దరును అల్లా మొక్కు కున్నామని రాజాగారితో చెప్పారు. ఆయనకోపం ఇరవై సమాసాలతో వ్రాస్తేగాని తీరేటట్లు లేదు. అంతకోపం వచ్చింది. కాని ఆయన రీతికవిగాదు. ధ్వనికవి. అందుచేత ఒక్కమాటయినా లేకుండా ఆ కోపం అల్లాగే ఉండిపోయింది. కాని ఆ కోపంచూస్తేమాత్రం ఇద్దరు రాణులకు ఎంతో భయంవేసింది.

ఇలా ఉండగా అమ్మాయి పెండ్లి సంబంధాలు వస్తున్నవి. వస్తున్నకొద్ది ఆవిడ మద్రాసు వెడదామని తండ్రిని నిర్బంధించటం మొదలుపెట్టింది. కాపురం మద్రాసులోనే పెట్టాలని. కాపురం మద్రాసులో పెట్టేందుకు పెద్దరాణీ గారికి, చిన్నరాణీగారికి ఏమీ యిష్టంలేదు. రాజాగారికి పోయి వుండవలెననే ఉన్నది. ఆయన గుణవంతుడో గుణ వంతుడు కాడో తెలియదు. కాని సామాన్యంగా జమీం దారులలో కనుపించని ఒక్క గుణం ఆయనవద్ద నున్నది. ఆయన ఏకపత్నీ వ్రతుడు. అందుచేత భార్య రాకుండా మద్రాసు పోయి ఉండటానికి ఆయన అంగీకరించలేదు.

కాని కూతురు బలవంతమెక్కువైనది. పెళ్ళికూతురు, ఆయనమాత్రం నాలుగు నెలలు మద్రాసులో ఉండి వచ్చారు. వచ్చేటప్పటికి తండ్రి ఒక మోస్తరుగా మారారు. కూతురు ఒక మోస్తరుగా మారింది. తండ్రి దొరలకు ఉన్నపార్టీ లివ్వటం; రాజకీయాలలో జోక్యాలు కలిగించు

క్కోవటం; గుర్రపుపందాలు, అన్నింటికన్న మించి ఒక సినీమా కంపెనీ పెడదామనటం, యిల్లా తండ్రి మారాడు. కూతురు తల బాబ్ (Bob) చేయించడం, నగలన్నీ తీసివేయడం; చీరకట్టడం మానివేయటం; అస్తమానం టెన్నిసు ఆట.

ఇంటికి తిరిగి రావటంతోటే కోటలో టెన్నీసుకోర్టు వేశారు. ఆవిడతో ఎంతసేపు ఆడినా పిల్లవాణ్ని పెంచే మిస్సమ్మ ఉన్నది, ఆవిడ ఆడాలి; లేకపోతే తండ్రి ఆడాలి. రెండు నెలలు గడచేటప్పటికి తోటి ఆటగాళ్ళు వీళ్లిద్దరే అయినారు. అది యెలా జరిగిందో ఊళ్ళో ఉన్న క్లబ్ లో ఆడేవాళ్ళు క్రమంగావచ్చి కోటలో ఆడటం మొదలుపెట్టారు.

జమీందారు ఆడవాళ్ళ ఘోషా బ్రాహ్మణుల ఆచారంవంటిది. అది స్వంతఊళ్ళో ఉన్నప్పుడు మహా ఎక్కువ. పట్టణం వెడితే అందులో నాల్గవవంతు కావచ్చు నని శాస్త్రమే చెప్తారు పట్టణే పాదమాచారం అని. అట్లాగే ఘోషాగూడాను.

మద్రాసు వెడితే అస్తినాస్తి చికిత్సా హేతువవు తుంది. అయితే అవుతుంది. మళ్ళీ యింటికి రావటంతోటే ఆ ఘోషా అంత వస్తే మన వూళ్ళోవాళ్ళు నవ్వకుండా ఉంటారు. బ్రాహ్మణులు చూడండి. బస్తీకి పోతారా అక్కడ హరిజను లెంతమందైనా సరే వాళ్ళను ముట్టుకుంటారు. వాళ్ళతో మాట్లాడతారు. వాళ్ళలో కొందరు స్నేహితులు కూడాను. ఒకరిద్దరితో ఏరా అంటే ఏరా అనుకునేటట్లుం టుంది. ఆ బ్రాహ్మణ కుర్రవాడే తన వూరు వెడితే తనవూరి పంచముడు దూరంగా తొలగాలి. తొలక్కపోతే తిట్లు

తరాలు దాటుతవి. ఈ సంప్రదాయం ఒకటి వుంది. గనుక జమీందారు కూతురు మద్రాసులో ఎట్లావున్నా ఈ వూరు రావటంతోటే మళ్ళీ ఘోషా లేకుండా వున్నదని పెద్దరాణీ లిద్దరు రుసరుసలు మొదలుపెట్టేరు. దానితో పాటు ఈ పిల్లకు పెందరాడే పెళ్ళిచేస్తేకాని ఈవిడ ఈ వేషాలు మానదని ఒక ఊహ చేశారు. అందుచేత పెండ్లి విషయంలో కోటలో బాగా మొదలుపెట్టింది.

జమీందారుగార్కి పిల్లకు అంత తొందరగా పెండ్లి చెయ్యటం అంత యిష్టం లేదు. కాని తల్లి భార్యల పోరాటం ఎక్కువైంది. చివర కాయన అంగీకరించాడు.

సంబంధాలకోసం నీలకంఠశాస్త్రి బయలుదేర వల సింది. తక్కినవాళ్ళ కేమి లాభం? నీలకంఠశాస్త్రి దమ్మిడీ తినే మనిషి గాడు. సంబంధాలు కుదురుస్తానని అటు యిటు వేలు తినే మనిషి గాదు. దీనికి తగినవాడు ఒకడు కోటలో ఉన్నాడు. వాడిపేరు మురహరి. అతడు బ్రాహ్మణుడు కాడు. రాజుగారికి మద్రాసు వెళ్లేవరకు వీళ్ళు బ్రాహ్మణులు వీళ్ళు కారు అనే భావం ఉండేది కాదు. అయినప్పటికి మురహరి తత్పూర్వంగూడా ఈ వర్ణం ద్వేషపుమాటలను రాజుగారితో చెపుతూనే వుండేవాడు. రాజాగారు తాత్కాలికంగా వానికి ఊకొడుతూ ఉండేవాడు. మనుష్యుని మనస్సు అనేక పొరలు కదా! ఒక పొరలో తాను బ్రాహ్మణుడైనచో బ్రాహ్మణు డనని, కానిచో కాదని యుండును. ఆ పొరలో వున్న భావమే పైకి తీసి ఆ ప్రకారంగా నడిస్తే సంఘం కొంత గగ్గోలుపడటానికి వీలుగా వుంటుంది. ఆ భావాన్ని మరుగు

పరచి ప్రతివాడికి ఏదో వర్ణం లేకుండా ఉండదుగదా అని గ్రహించి వర్ణం అనేది స్వాంతం, మనుష్యుడు సంఘానికి సంబంధించినవాడు అని ప్రవర్తిస్తే లోకంలో సంఘువిప్లవం, వర్ణవిప్లవం, ధర్మవిప్లవం, సంప్రదాయవిప్లవం జరగదు. ఆ జమీందారులందరూ పూర్వం అట్లా వున్నవారే. ఈయన మొన్నటివరకూ అల్లా వున్నవాడే. ఇప్పుడూ అంత చెడిపో లేదు. కాని మద్రాసు వెళ్ళి వచ్చిన తరువాత మురహరి చెప్పే మాటలమీద పూర్వంకంటే ఎక్కువ అభిమానం కలిగినట్లు తోస్తుంది. అందుచేత పిల్ల సంబంధం కుదర్చటం మురహరి కప్పగించారు. వివాహం అంతా మురహరి చేతి మీద నడిచేటట్టుంది.

ఒకరోజున నీల కోటలోకి వస్తూంది. మురహరి ఎదురుగుండా వస్తున్నాడు. శిలారు ఆ ప్రక్కనే నిలుచున్నాడు. మురహరికి కోటలో తన ప్రాధాన్యం తెలిసింది. అందుచేత ఊరికేనే నీలను అన్నాడుగదా ఎక్కడికి అని. నీల మాట్లాడకుండా అంతఃపురంలోకి నడుస్తోంది. మురహరి వెళ్ళటానికి వీలులేదన్నాడు. ఆ అమ్మాయి వినిపించుకోకుండా వెడుతూంది. పసిపిల్ల తాను మాట్లాడకుండా ఊరుకున్నాపోయేది. వెళ్ళి చెయ్యిపట్టుకు లాగాడు. అది గడుసరి. మురహరిని ఏదో తిట్టింది. మురహరి కొట్టాడు. అంతవరకూ చూస్తూన్న శిలారు మురహరిని రెండు వాయించాడు. గోటితో పోయేది గొడ్డలిదాకా వచ్చింది. శిలారుమీద కేసు రాజాగారిదాకా వెళ్ళింది. రాణీగార్లిద్దరూ శిలారు వైపు. చివరకు రాణీగార్ల కొమ్ము పడిపోయింది. ఎందుచేతనంటే

పిల్లకు పెండ్లిసంబంధం కుదర్చవలసినవాడు మురహరి. అతనికి అనుకూలంగా చేయక తప్పినదికాదు. మురహరి చూస్తూ వుండగా, శిలారును రాజాగారు ఆరుదెబ్బలు కొట్టాడు. ఆ కొరడా ఈమధ్య మద్రాసులో కొనుక్కొవచ్చింది.

శిలారుకు ముప్పదియైదేండ్లున్నవి. వాడింతప్పటినుంచి కోటలో పెరిగినవాడు. శిలారుకు రాజాగారిమీద కోపం రాలేదు. కోపంఅంతా మురహరిమీద. వాడు దెబ్బలు అన్నీ తింటూ ఊఁ అనలేదు ఆ అనలేదు.

శిలారు దగ్గర ఒకవిశేషం ఉంది. అతడు బొగ్గుతీసికొని, సుద్ద తీసికొని కోటలో బయట ప్రహరీగోడమీద బొమ్మలు గీస్తూ ఉంటాడు. వాడు బొమ్మగీస్తే సరిగ్గా ముఖ లక్షణాలన్నీ వస్తవి. ఈవిద్య అతడు ఎక్కడా నేర్చుకున్నది గాదు. ఊళ్ళో ఒకసారి ఒక చాకలిదానికి జబ్బుగా ఉన్నది. ఆ చాకలిది చచ్చిపోయినట్లు బొమ్మవేశాడు. నిజంగానే ఆ చాకలిది చచ్చిపోయింది. ఈ సంగతి నోటానోటా పాక్కి చాకలివాడు అతనిని కొట్టటానికి సిద్ధమైనాడు కాని, మూగ ముండాకొడుకు, పిచ్చిముండాకొడుకు అని వాళ్ళూ వీళ్ళు చెపితే ఊరుకున్నాడు. ఇల్లా అతనికి వెర్రిపుట్టినప్పుడల్లా ఎవ్వో బొమ్మలు వెయ్యటం కద్దు. ఆ వేసినబొమ్మలు యిట్లా జరుగుతుంది అని చెప్పినట్లు ఉంటవి. అల్లా ఒకటి రెండు సారులు జరిగింది. చాలా సారులు జరగలేదు. అందుచేత ఆ బొమ్మలకు పాటింపులేదు. పైగా ఏవరిమీద కోపంవస్తే వాళ్ళనుగురించి బొమ్మలు వేస్తాడు.

ఆనాడు సాయంత్రం, అతను ఈ బొమ్మలు వేసే గోడ ఒకటి ప్రత్యేకంగా ఉంది, ఆ బొమ్మలన్నీ చెరిపేశాడు. కొత్తగా ఒక బొమ్మ వేశాడు. ఆ బొమ్మ యేమిటంటే జమీందారుగారు మురహరిని కొరడాతో కొడుతున్నట్లు, చిన్న రాణీగారు చూస్తున్నట్లు. యిందులో చిత్రమేమిటంటే చిన్నరాణీగారి నెత్తిన జుట్టులేదు.

ఈ బొమ్మ వేశాడని నాలుగయిదురోజులలో కోట అంతా తెలిసింది. ఆ గోడభాగందగ్గరకు ఎప్పుడూ దొరలు వెళ్ళరు. ఒకరోజున అక్కడికి ఎందుకో జమీందారుగారు వెళ్లి ఆ బొమ్మ చూశారు. ఆబొమ్మ వేసి అప్పటికే నెలపైన అయింది. జమీందారుగారు చూచేటప్పటికి రాణీగారి నెత్తిన జుట్టు ఉందో లేదో సరిగా కనుపించలేదు. కాని మురహరిని తాను కొరడాతో కొట్టుతున్నట్టు కనిపించింది. రాజాగారు నవ్వారు.

ఆరోజున శిలారుపంట పండింది. రాజాగారు భోం చేసేటప్పుడు శిలారునుకూడా ప్రక్కన కూర్చోపెట్టుకున్నారు. దొరగారు ఆరోజున యేదో పిండివంటలు చేయించారు. శిలారుకు తృప్తిగా పెట్టారు. శిలారు భోంచేస్తున్నంతసేపు రాజాగారు కొట్టినదెబ్బలు యిక్కడ తగిలినవి అని చూపించడం దెబ్బ తగిలితే బాధపడ్డట్టు నటించడం చివరకు నవ్వటం, రాజాగారు నవ్వటం. శిలారు ఒక్కొక్కమనిషిని ఒక్కొక్కరీతిగా అభినయిస్తాడు. మురహరి బక్కపలచని వాడు. ఎగుబుజాలవాడు. కళ్లు చిన్నవి. శిలారు మురహరిని నటిస్తే రెక్కగూళ్ళు పైకెత్తి బుజాలు చెవులుదాకా రానిచ్చి

కళ్ళు చిన్నవి చేసి మురహరిని నటిస్తాడు. అల్లా నటించి రాజాగారు మురహరిని కొడుతున్నట్లు మురహరి బాధ పడుతున్నట్లు రాజాగారికి చూపించాడు. రాజాగారు శిలారును కోప్పడ్డాడు. ఎందుచేతనంటే మురహరిని కొట్టటం జరగటానికి వీలులేదు. శిలారు కాసావాడు కాకపోయినా కాసావంటి వాడు. కాసావాణ్ణిమాత్రం కొడతారా? వీడు మరీ ఏకాకి. రాజాగారు కొట్టినా ఊరుకుంటాడు. మురహరి మంచి కుటుంబములోనివాడు. ఏదో సమపాళంగా డొక్కశుద్ధయిన వాడు. జమీందారుగారి ఆపనులమీద ఈపనులమీద తిరిగే వాడు. అతడు శిలారుని కొట్టినట్లు కొట్టటం సంభవించదు. పైగా అట్లా నటిస్తే మర్యాదకు భంగం పాపం! మురహరికి. అందుచేత రాజాగారు శిలారును కోప్పడ్డారు. కోప్పడు తే మాత్రం వా డూరుకుంటాడా. నీలని మురహరి కొట్టినాడనీ నీలకు తనకూ స్నేహమనీ నీల దేవతాపిల్లని రకరకాలుగా అభినయించి చెప్పాడు.

ఆరోజు సాయంత్రం నీల మళ్ళీ కోటలోనికి వచ్చింది. సంబంధంకోసం వెళ్ళి యేదోవూరునుంచి మురహరి ఆ రోజునే వచ్చాడు. నీల అంతఃపురంలోకి వెళ్ళుతూవుంటే మురహరి చూచాడు. దూరంగా శిలారు నుంచుని చూశాడు. మురహరి ఒకసారి నీలవంక చూశాడు. ఒకసారి శిలారువైపు చూశాడు. శిలారు భయపడి వుంటాడని మురహరి అనుకున్నాడు. కాని శిలారుకళ్ళు చూస్తే నిప్పులు చెరుగుతున్నవి. మురహరి నీలను ఏమన్నా అన్నాడో శిలారు మురహరికి గోరీ కట్టాడన్న మాటే. అల్లావున్నవి శిలారు కళ్ళు. పైగా తన్నురాజాగారు

కొరడాతో కొడుతున్నట్లు వాడు బొమ్మగీయటం రాజాగారు చూచి నవ్వటం వాడికి పిండివంటలతో భోజనం పెట్టడం యిదంతా మురహరికి తెలిసింది. ఈసారి శిలారు తన్ను కొడితే ఏమీ జోక్యం కల్పించుకోడు. అందుచేత ఊరు కోటం పరమోత్తమం. నీల కోటలోకివస్తే తనకేం? నీల బ్రాహ్మణపిల్ల. అందు సోమేశ్వరం మేనకోడలు. బ్రాహ్మ లకు, బ్రాహ్మణులుగాని జమీందారులకోటలో పలుకుబడి ఎందులకు? ఈ కోటలో సొమ్ము ఈ బ్రాహ్మలు యిదివరకే చాలా తిన్నారు. మురహరి యిక తిననివ్వడు.

౧౨

సోమేశ్వరానికి, జమీందారుగారికి ఏమి సంబంధం లేకపోయినా పూర్వం ఉన్నంత ఘోరంగాలేదు. బావిజల కోటను ముంచేస్తుందన్నప్పుడు అతను కోటలోకి వెళ్ళటం; ఇతని మాటలు రాజుగారు సావధానంగా వినటం; పైగా జపాలు చేయించటం; దానికి తగినట్టు నీటిజల కట్టటం అందరి మనస్సుల్లో ఎవ్వరు యేమి అనకుండానే సోమేశ్వరానికి జమీందారుకి సదభిప్రాయమేనూ అన్న విశ్వాసం వ్యాపించింది.

సోమేశ్వరం ఎప్పుడూ కోటలోకి రాడు కాని ఒక రోజున నీల ప్రొద్దు నడిరాత్రికి తిరిగినా యింటికి రాలేదు. ఇతను వెతకటానికి బయల్దేరాడు. కోటలోనికి వచ్చాడు. శిలారు నడిగాడు. శిలారు పిల్ల రాణీగారితో మాట్లాడుతోందని చెప్పాడు.

వాడు విధవవాళ్ళను చెప్పాలి అంటే నెత్తినముసుగు వేసుకుని రొమ్ము మూసుకొని ఒకవిధమైన సిగ్గుపడి చెప్తాడు. పుంస్త్రీలను చెప్పాలంటే కళ్ళు పెద్దవిచేసి బుగ్గలుబ్బించి మొఖాన కుంకుమబొట్టు చూపిస్తాడు! మొగవాడు అంటే మీసం చూపిస్తాడు రాణీ అంటే పల్లకీమోసినట్లభినయిస్తాడు. ఇది వాడిపరిభాష.

నీల అంతఃపురంలో ఉంది. సోమేశ్వరం ఎలా వెడతాడు? నీల రావటం ఎలాగా? పిల్ల ప్రొద్దున చద్దిఅన్నం కూడా తినలేదు. అక్కడవున్న కాసావాళ్ళమధ్య, సోమేశ్వరం మధ్య అదొకబెట్టు. ఒకరితో ఒకరు మాట్లాడరు:

ఇంతలో నీలకంఠశాస్త్రిగారు వచ్చారు. ఏమండీ! యిలావచ్చారు అన్నాడు.

సోమేశ్వరం 'మా మేనకోడలు రాణివాసంలోకి వెళ్ళిందండి! ప్రొద్దుటినుండి అన్నం తినలేదు. పంపించమంటున్నారని కబురుచేస్తే బాగుండును' అన్నాడు.

దివాను ఎవరినో పిల్చి వాళ్ళ పిల్లను పిలుస్తున్నారని చెప్పమని పంపించాడు. పంపించి సోమేశ్వరంతో 'మీతో ఒకమాట మాట్లాడాలని చాలారోజులుమట్టి అనుకుంటున్నాను. ఎప్పుడూ తీరటం లేదు. యిప్పుడు మరీ పని యెక్కువగానే ఉంది. చిన్నదొరసానిగారిపెళ్ళి డబ్బువసూలు చేయటంతో సరిపోతోంది. కాసేపు కూచుంటారా! అయినా భోజనం వేళ అయిందేమో.'

సోమేశ్వరం 'ఫరవాలేదు. మా యింట్లో ఎప్పుడూ ప్రొద్దు తిరిగితేగాని భోజనాలు కావు, చెప్పండి' అన్నాడు.

ఇద్దరు ఒకచోట కూర్చున్నారు. నీలకంఠశాస్త్రి మొదలుపెట్టాడు 'ఏమీలేదండీ! మా యింట్లో కథేను. మా పిల్లవాడికి ఎప్పటికప్పటి కెర్క్కవగా వుంది. యేమి చేసినా తగ్గటం లేదు. వాడికి పదహారు పది హేడు యేళ్లున్నవి.

ఇంతమటుకూ ఘోర్తుఘారం ప్యాసుకాలేదు. దాని దుంపతెగిరి చదువు. పిల్లవాడికి ఈ పిచ్చి నిమ్మదిస్తే చాలు. సంబంధాలు వస్తున్నవి. పెళ్ళిచేస్తే బాగుపడతాడేమోనని ఊహ ఎవళ్ళు వచ్చినా అతన్ని చూచి తిరిగి పోతారు. పిల్లవా డట్లా ఉండటం మూలంగా యింట్లో బాగా ఉంటం లేదు' అని మొదలుపెట్టేడు.

సోమేశ్వరం ఏమంటాడు? అసలు దివానుగారు తనతో మాట్లాడినవాడు గాదు. దివానంటే ఆ ఊళ్లో పెద్ద ఉద్యోగి. తాను బుక్కాఫకీరు. దివానుగారు తన్నుపిలిచి యిల్లా కుటుంబపరిస్థితిని చెప్పటం సోమేశ్వరంకు ఆశ్చర్యం వేసింది; తన కావ్యాల్లో అంత మర్యాద బలిసిందా అని.

సోమేశ్వరం అన్నాడుగదా 'చిత్తం! నేనేంచేయ గలుగుదును?' అని.

దివాను మళ్ళీ 'అదిగాదు. ఈ విషయం మీతో ఎందుకు మాట్లాడానంటే మీ రేదో ఉపాయం చెపుతారని. అసలుసంగతి మీకుతెలుసుగదా. మా నాయనగారు పెద్ద లలితోపాసకుడు. మా యింట్లో బాల తిరుగుతూఉండేదని చెప్పేవాళ్ళు. అవన్నీ వట్టి కబుర్లనుకోండి. నేను ఆ పూజా మందిరం మా నాయనగారు పోయినప్పుడే దానం యిచ్చే శాను. తరువాత మా యింట్లో యంత్రం ఉండేది. ఆ యంత్రా

నికి ప్రతి శుక్రవారం పూజ చేసేవాణ్ణి. మొత్తానికి ఆ యంత్రానికి పూజ మానివేయటం; పిల్లవాడికి మరీ ఎక్కువ చేయటం ఒక్కసారే జరిగినవి. మీ రెప్పుడైనా చూచారో లేదో మా అబ్బాయిని, తలంతా చీకిరి బాకిరిగా పెట్టుకుని మకిలి గుడ్డలతో పిచ్చి బికారు ఊరిలో తిరుగుతూ ఉంటాడు. యింటికివస్తే తల్లిని కొడతాడు. పిల్లలను కొడతాడు. ఏది దొరికితే అది ఎత్తుకుపోతాడు. దీనికేమైనా ప్రతిక్రియ చెప్పుతారేమోనని మిమ్మల్ని అడుగుతున్నాను' అన్నాడు.

సోమేశ్వరం:- మీకు విశ్వాసం లేకపోతే పోయెను. మనకు పిల్లవాడు సరిగ్గా ఉండటం ముఖ్యం. దీనియందు విశ్వాసమున్నదిగదా! యివి సాధించేందుకు అది చేయవచ్చును.

దివాను :- నా యంతరాత్మకు యిష్టం లేనిపని అది.

సోమే :- కొడుకు యిలా అయిపోవటం అల్లాగే అతన్ని ఉంచటం అంతరాత్మకిష్టమైనపనా అది. మీరు విశ్వసించేవిషయం ఇది. యింకొకజీవుడు విషయం. ఆ జీవుడు మీ కొడుకే కావచ్చు. వేరే జీవుడు. అత డల్లా అయిపోవటం మీరు చెయ్యవచ్చునా? కనుక అతనికోసం జపాలు చేయించండి. జపాలు చేయిస్తే తప్పేమున్నది? మనమందరం రాజాగారికంటె తీవ్రవాదులమా? రాజాగారు జపాలు చేయించారు కాదా! ఆ జపాలు జపాలే. మన విశ్వాసాలు విశ్వాసాలే. యిది లోక ప్రవృత్తమే. మన కొకడితో బలవి ద్విరోధం ఉంటుంది. వాడితో ప్రాణం ముంచుకపోయే పని

వస్తుంది. అప్పటి కెల్లాగో అల్లా వాడితో మాట్లాడి మన పని మనం సాధించుకోఖ్ఖ ర్లేదా? అల్లాగే యిదిన్నీ.

దివాను:- ఒకవేళ చేయిస్తాననుకోండి. ఈ సంగతి మా గురువుగారికి తెలిస్తే ఏమీ బాగుండదు.

సోమేశ్వరం:- మరి ఏమి చెయ్యమంటారు ?

దివాను:- నాకే తోచటంలేదు.

సోమేశ్వరం:- ఇది ఎవరింటోనన్నా చేయించండి.

దివాను:- ఎవరున్నా రీ వూళ్లో మనకు.

సోమేశ్వరం:- మా యింట్లో చేయించమంటే చేయిస్తాను. నాకేమీ అభ్యంతరం లేదు.

దివాను:- మీరు మంచివారని నాకు తెలుసు ననుకోండి. నా మనస్సుకే ఒప్పుదల కావటంలేదు. అయినా జపాలు చేయించగల బ్రాహ్మణులు మన వూళ్ళో ఎవరైనా ఉన్నారా ?

సోమేశ్వరం:- ఇల్లాంటివాటికి పనిచేసే ఆయన ఒక ఊళ్ళో ఉన్నాడు. గొప్ప ఉపాసకుడు. గొప్ప మంత్ర శాస్త్రవేత్త.

దివాను:- ఆయన మనకు సాధ్యమవుతాడా ?

సోమేశ్వరం:- న న్నె రు గు ను. నేను తీసుకుని రాగలుగుదును.

తరువాత దివానుగారు జేబులోనుంచి తీసి పాతిక రూపాయలు సోమేశ్వరాని కిచ్చాడు. వారిని తీసుకురండి అన్నాడు. అని 'నిజమేలెండి నాకు వి శ్వా స ం ఉండి చేస్తున్నానా?'

సోమేశ్వరం:- 'మీ ఉద్దేశ్యం యిది యేదైనా దేవతా సంబంధమైనదనా?' అన్నాడు.

దివాను:-అవును.

సోమేశ్వరం:- అయితే మీ గురువుగారేమన్నారు?

దివాను:- ఏమన్నారు, ఎప్పుడూ ప్రార్థనలూ చేస్తాం. దానివల్ల ఏమీ ప్రయోజనం కల్గలేదు.

సోమేశ్వరం:- కలగదనే అనుకుంటాను.

దివాను:- ఎందుచేత ?

సోమేశ్వరం:- ప్రార్థన ఏమిచేస్తుంది ? మనస్సును నిశ్చలపరుస్తుంది. అంతమాత్రముతో ఏమిపని జరుగుతుంది?

దివాను:- ఆత్మశక్తి వృద్ధిపరుస్తుంది. ఆత్మశక్తి దాటినదేమో యిది.

సోమేశ్వరం:- ఆత్మశక్తి అంటే మనకున్న ఆత్మ శక్తియా ? మన ఆత్మ మనకు తెలుసునా ? ఆత్మను చూచామా ! ఆత్మను తెలుసుకున్నామా ? ఆత్మనుగూర్చి ఆలోచించామా ? ఆత్మను ధ్యానించామా ? మన ధ్యానం అంతా మన పిల్లవానికి నయంకావాలని. మీరు నిర్గుణోపాసకులు. నిర్గుణోపాసకులకు గుణసహితమైన ప్రపంచములో ఏమి సంబంధం? సగుణోపాసకునికి లోకంలోవుండే వాంఛలకు సంబంధం ఒకటి చూచారా! మీరు లలిత తిరిగింది యింట్లో అంటె నమ్మరు. ఆరోజున నేనుమాత్రం శక్తినిగురించి చెపితే మీరు విన్నారనుకుంటాను. మంత్రము దానిశక్తి ఈమధ్య ఒకరూపము. ఇవన్నీ భిన్నజగత్తులలో భిన్నములుగ ఉన్న పరమార్థం ఒకటె. మన మంత్రంద్వారా ఒక దేవతకి రూప

కల్పన చేస్తే ఆరూపంతో ఆ దేవత అల్లాగే వుంటుంది. లౌకికంగా మనం ఒకణ్ణి పిలుస్తాం. వాణ్ణి వెళ్ళిపొమ్మనేవరకు వాడు వెళ్ళిపోడుగదా. ఇప్పుడు మానేసినా అసలు సంగతి తెలుసుగదా మీకు. ఒక సత్యనారాయణవ్రతం చేస్తాం. మరునా డుద్వాసన చెపుతాం. ఈ సామాన్యమైన వ్రతాలకు మీ పూర్వులు మహోపాసకులైతే ఆ మంత్రశక్తి లెట్లాం టివో దానిచేత రూపంపొందిన దేవతలెట్లాంటివారో వాళ్ళకు శాంతులు ఎట్లా చెయ్యాలో ఆపద్ధతిగా చేయిం చండి; పిల్లవాడికి నిమ్మదిస్తుందనుకుంటాను.

దివాను:- నాకు వాటిల్లో ఏమీ విశ్వాసం లేదండీ! ఆ కుర్రవాడికోసం చేస్తున్నాను. పైగా జమీందారుగారు చేయించారుగదా! యేమిటోనండీ, అవుననటానికి వీలులేదు. కాదనటానికి వీలులేదు. సరే, మీరు వెళ్ళి ఆయన్ను కనుక్కోండి. ఆయన చేయగలుగుదునూ అంటే తీసుకురండి. ఏమీ లేదు. పిల్లవాడు వృథాగా చెడిపోతున్నాడు. నాకు భయమేమిటంటే యిది స్వార్థంకింద పరిణమిస్తుందేమోనని అన్నాడు.

సోమేశ్వరం తనకు రెండు మూడురోజులు వెళ్ళ టానికి వీలులేదని తరువాత వెడతానని చెప్పాడు. ఇంతలో నీల వచ్చింది. యిద్దరు యింటికి వెళ్ళారు.

ఆ రోజున సాయంత్రం దేవిడీలోని సేవకులు సోమే శ్వరానికి ఎక్కడ కనపడ్డా దణ్ణాలుపెట్టటం మొదలుపెట్టారు. యిదేమిట్రా అని ఆలోచిస్తే యిది. ప్రొద్దున యింతసేపూ దివానుగారు సోమేశ్వరంతో మాట్లాడితే ఏదో రాచకార్య

మని మళ్ళీ సోమేశ్వరానికి కోటతో పని ఏర్పడ్డదని అందరు అనుకోటం మొదలుపెట్టారు. దానితో దణ్ణాలు పెరిగినై.

ఇది యిలా ఉండగా మురహరి జమీందారుగారి కూతురికి ఒక సంబంధం కుదిర్చాడు. కాని అది యాభై వేలు కట్నం. పిల్లవాడు ఒకపల్లెటూరిలోని జమీందారు. చదువు సంధ్యలు ఎక్కువ లేవు. అది చాలా పూర్వాచారపరాయణపు జమీందారీ. ఆరోజున పెండ్లికొడుకువారు వచ్చి పిల్లను చూస్తామన్నారు.

ఈవిడకట్టు దొరసానివలె వుంటే ఈ గిరజాలజుట్టుతో, వారు తిరిగి పోరా? తల్లీ, నాయనమ్మా వంద చెప్పారు. వెయ్యి చెప్పారు. ఆవిడ ఆ సంబంధం తనకక్కర్లేదన్నది.

ఆ మధ్యాహ్నమే పెళ్ళివారు రానేవచ్చారు. వస్తే పెళ్ళికూతురు ముందరికోటలో టెన్నిస్ ఆడుతోంది. ఆవిడే పెళ్ళికూతురని ఎట్లా అనుకుంటారు. చివరికి తెలిసింది. వాళ్ళదారిని వాళ్ళు వెళ్లారు.

మురహరికి ఈ బేరంలో చాలానష్టం. కనీసం పది వేలయినా అతనికి చెడిపోయినవి. అతను తృప్తిపడ్డాడు. దంపినమ్మకు బొక్కిందే కూడని నాలుగైదువందలు మిగలక పోలేదు. ఇంకా నాలుగయిదు సంబంధాలు చూచాడు. ఒక సంబంధం జమీందార్లుగారు, పెద్దాస్తిపరులు. పిల్లవాడు చదువుకున్నాడు. వాళ్ళకు పిల్లా ఇల్లాంటిదవటం అభ్యంతరం వుండదనుకుంటాను అని అతడు దివానుగారితో అన్నాడు. అన్నాడుగాని ఇద్దరు నోళ్ళు నొక్కుకున్నారు.

ఒకరోజున జమీందారుగారి కూతురు టెన్నిస్ ఆడుతూంటే నీల అక్కడికి వెళ్ళి ఆ స్తంభందగ్గర అల్లాగే నిలుచుంది. ఆవిడకి నీలమీద కోపం. నాలుగయిదుసారులు వెళ్ళిపొమ్మంది. నీలవెళ్ళలేదు. ఆవిడ చాలాసారులుబంతితో నీలను కొడదామని ప్రయత్నించింది. ఎన్నిసార్లు ప్రయత్నించినా బంతి నీలకు తగల్లేదు. బంతి తగల్లేదని పెళ్ళి కూతురుకు కోపంవచ్చి చివరికి నీలను బ్యాట్‌తోనే కొట్టింది. నీల ఏడ్చింది. ఏడ్చి అన్నదిగదా: 'చివరకు నీకు ఎల్లాగంటె మొగుడువస్తాడో తెలుసునా? నీవంక చూడడు. నీవు ఒకటంటే వాడు ఒకటంటాడు. నీకు దేవతలు లేరా? వాడికి ఉంటారు. నీవు దొరసానివా ? వాడు తెలుగువాడు. నీది మతమా ? వాళ్ళదికాదు. నీకు ఘోషా అక్కర్లేదా ? వాడికి కావాలి.'

ఈమాటలు నీల అంటూఉండటం జమీందారుగారి కూతురు కొడుతూవుండటం. చివరకు శిలారు వచ్చి నీలను తీసుకువెళ్లాడు. వెళుతూ వెళుతూ నీల ఇది నాశాపం ఇది నాశాపం అంటూ వెళ్ళింది.

ఈమాటలు విన్న కాసావాళ్ళందరు వాళ్ళల్లో వాళ్లు చెప్పుకోటం నవ్వటం. ఈమాటలు పెద్దరాణీల చెవులదాకా వెళ్లినవి. వాళ్ళిద్దరు విరగబడి నవ్వారు.

ఈ నవ్వటానికి భూదేవికి ఎంత కోపంవచ్చిందో చెప్పలేము. నాలుగురోజులు ఆవిడ తల్లితో మాట్లాడలేదు. రాజీ కుదిరింతర్వాత నాయనమ్మ నెత్తిపొడిచింది 'నాకంటే నీ కా బికారిపిల్లంటే ఎక్కువ యిష్టం. నేను వెళ్ళిపోయిం తరువాత దాన్ని తీసుకొచ్చి పెంచుకోండి. ఘోషాలో

పెట్టండి. మీకుమల్లేనే దానినికూడా మూఢురాలిని చేయండి. దేవతలు, దయ్యాలు మీయిష్టమే యిష్టం. ఈ దేశమంతా ఎప్పుడు నాశనమాతుందో తెలియదు. ఇన్నిమూఢవిశ్వాసాలు ఈదేశంలోకాకుండా మరెక్కడా ఉండవు. ఆడది అంటే పంజరంలో చిలకన్నమాట. పలకకూడదు. ఆడదానికి ప్రాణం ఉన్నది. దానికి కోరికలున్నవి. దానికి స్వేచ్ఛ కావాలి. అది మనిషే. ఈ కట్టుబాట్లు యింకసాగవు' అని దీర్ఘోపన్యాసంచేసింది.

## ౧౩

భూదేవిగారి వివాహం నిశ్చయమయింది. నూకల కోసం ఏడ్చి ఏడ్చి తవుడుకోసం ఏడ్చారన్నట్లుగా జమీందార్ల సంబంధంకోసం వెదకి వెదకి చివరకు సామాన్య సంబంధాల కోసమే వెదికారు ఎవరిని చూచినా ఆవిణ్ణి చూచి భయపడ్డారు. చివరికి జమీందారుగారికి కొన్ని వ్రేళ్ళువిడిచిన మేనల్లు డెవడో వున్నాడు. అతనికి నిశ్చయంచేశారు. అతడు మేనల్లుడని వివాహసంబంధం నిశ్చయమైనతరువాత తెలిసింది. తెలిసింతరువాత సంబంధం బాగా వున్నదనిపించింది. అతడేమి వట్టివాడు కాదు. చదువుమాత్రం లేదుగాని, సూటు బూటు హేటు వేస్తే జమీందారీఛాయాకేమీ భంగంలేదు.

పూర్వకాలంలో ప్రభువంటే అది వేరే పద్ధతి. వ్యాయామం చేసిన యింత రొమ్ము, కత్తిసాము, గుర్రపు స్వారీ, మొఖంలో చెనకరానితనం, పులిమీసం, వైష్ణవులైతే పంగనామాలు, శైవులైతే పెద్ద కుంకుమబొట్టు, ఎదురు

రొమ్ముకు కవచం వేసినట్లుగా కుట్టిన బొందు-చొక్కా, కాలికి గండపెండేరము లేకపోతే ఒక కడియం, ఆ కడియం కనిపించేటట్లుగా ధోవతిచెంగు పైకి లాగుకొనేటట్లు బిగించి వెనుకకు దోపిన పంచెకట్టు. పూర్వకాలపు దొరలు చూడ ముచ్చటగా యిలా ఉండేవాళ్లు. ఇప్పటి దొరలు టెన్నిసుబూటు, తెల్లని వదులు లాగూ, పులిచారల కోటు, చేతిలో బాటు, ఎడమ చేతి నడిమి చూపుడు వ్రేళ్ళకు మధ్య సిగరెట్టు దీనితో దొర వేషం తయారైపోతుంది. ఇప్పటి దొరలు దొరతనం మహా సులభంగా కొట్టేశారని చెప్పవచ్చు.

ఈ దొరతనంలో మన పెళ్ళికొడుక్కి ఏమీ లోపం లేదు. ఆయనకు సారస్వతమంటే తెలియదు. సంగీతమంటే తెలియదు. మన దేశం అంటే అంతకుముందే తెలియదు. హిగిన్‌బోథాములో చవుకబారు నవలలు ఏదో ఒకటి ఆయన చేతిలో ఎప్పుడూ ఉంటుంది. అది పెద్ద విశేషం కాదనుకోండి. అందరి చేతిలోనూ ఉంటుంది. ఆయన చేతిలోనూ ఉంటుంది. అదే ప్రభులక్షణం.

ఈయన పెళ్ళి. ఆయన అదే కోరాడు. ఆవిడ అదే కోరింది. మద్రాసులోనే జరగాలి. జరుగుతుంది. పెళ్ళి మద్రాసులో జరిగినా అనూచానంగా పెండ్లికొడుకు ఈ కోటలోకి రావటం; పెళ్లి అయినతర్వాత కొన్ని ఆచారాలు, నడవడికలు ఈ కోటలో జరగటం అలవాటు. చివరకవికూడా జరిగేటట్లు లేవు.

కాని జమీందారుగారి వూరు వట్టి లేకివూరు. వట్టి దేవుడుగొట్టు ఊరు. ప్రత్యేకంగా ఆ జమీందారుగారి వూరే

గాదు. ఏ జమీందారుగారి ఊరైనా అంతే. లేకి ఊరంటే దేవురగొట్టు ఊరంటే దురర్థమేమీ లేదు. ఆ లేకితనం, దేవురగొట్టుతనం ఆ వూళ్లో మనుష్యుల్లో నిజంగా ఉన్న గుణం కాదు. ఈ గుణాలు యిప్పుడు లేకితనం అనిపించుకుంటున్నయి గాని, పూర్వకాలంలో యిది గొప్పగుణం. అది ప్రభుభక్తిగా ఉంటుంది. అది అదిగా లేకపోతే యిది యిదిగా ఉండదు.

దొరగారి కూతురు పెండ్లి అనేటప్పటికి ఊరు ఊరంతా ఒకచిత్రంగా కలవరపడ్డది. అనుపూర్వికంగా ప్రతి యింటికి ఆ వూళ్ళో ఎవో మామూళ్ళు ఉన్నవి. వివాహమైతే కాసావాళ్ళకు కొన్ని మామూళ్ళు ఉన్నవి. అన్ని కులాలకు తలొక మామూలు. ఈ మామూళ్ళన్ని పెళ్లి ఊళ్లో జరిగితే జరుగుతవి. ఈ మామూళ్ళకెంత ఖర్చౌతుందో ఆ ఖర్చంతా దుబారా ఖర్చని, ఊరికే అందరిని మేపటం అని జమీందారుగారు అభిప్రాయపడ్డారు. ఆ వూళ్లో అందరు పేదవాళ్ళూ జమీందారుగారిని ఆశ్రయించుకొన్నవాళ్ళు. జమీందారుగారు తన భోగాలు తాను అనుభవించగా మిగిలిన డబ్బు వాళ్ళకు పెట్టటం కష్టవేసింది. జమీందారుగారి సొమ్ము వందలు వేలు తినే ప్రభువులు ఈ ఐదులు తినేవాళ్ళకు పెట్టటం వృధా అని, వ్యర్థమైనఖర్చని బోధించుతూ ఉంటారు. ఈ బోధన ఆధునిక అర్థశాస్త్రం లోని పరమరహస్యం. చూడండి గవర్నమెంటులోగూడా ఏదైనా ఖర్చు తగ్గించాలీ అంటే చిన్నచిన్న ఉద్యోగాల వాళ్ళను తీసేస్తారు. దీనివారడిగా వెయ్యో పంద్రెండు వందలో యిచ్చి ఒక పెద్ద ఉద్యోగస్తుణ్ణి వేస్తారు.

రాజాగారికి పెళ్ళి తనవూళ్ళో చెయ్యకపోవటంవల్ల చాల కలసివచ్చింది. ఈ వూళ్ళో ఇన్నివందలయిండ్లకు వెళ్ళే మామూళ్ళు చదివించే కట్నాలు అన్ని కలిసివచ్చినై. కలిసి వచ్చినవంటే యితర ఖర్చులకు ఉపయోగపడ్డవి. ఇతర ఖర్చులంటే ఈ ఊరునుంచి సుమారు యాభైమందైనా రాణివాసము రాజబంధువులు మద్రాసుకి ఫస్టుక్లాసులో, సెకండుక్లాసులో వెళ్ళాలిగా. ఆ ఖర్చు కలిసిరాలా? అయితే యీ డబ్బు యం. యస్. యం. కంపెనీకి వెళ్ళింది. వాళ్ళు పెదవాళ్ళేగా. యింకా చాలావాటికి ఉపయోగించింది. మద్రాసులో టాక్సీవాళ్ళ కుపయోగించింది. ఖర్చు యింత యినా అట్టే మాట్లాడితే యింకా ఎక్కువయినా యిందులో ఒక నైతికబలం ఉంది చూడండి. మామూళ్ళు అవి వూళ్లో వాళ్ళకు యిస్తే ఎప్పుడూ జమీందారుగారిమీద ఆధారపడి ఉండే దౌర్భాగ్యుల్ని ఊరికే మేపటమౌతుంది. రైలు వాళ్ళకు యిస్తే ఆధునిక నాగరికతను పోషించినట్లవుతుంది. యే నాగరికతవల్ల క్రొత్తగా సూర్య చంద్రులు నడుస్తు న్నారో; ఏ నాగరికతవల్ల ఆఫ్రికా దేశంలోని అడవులు పరిపాలింపబడుతున్నవో; యే నాగరికత సముద్రంలో ఉన్న బౌర్వాగ్నికి కొక్కెపెట్టి మందుగుండు మహాగ్నులు చెల రేగుతున్నదో; యే నాగరికతవల్ల ప్రపంచంలో ప్రధానంగా హిందూదేశంలో ఉన్న యువకులు గవ్వగచ్చకాయ లవు తున్నారో ఆ నాగరికతను పోషించినట్లయింది.

ఇవి ప్రజాస్వామ్యం రోజులు. ఆ జమీందారుగారి

ప్రభుభక్తి పోకపోతే వాళ్ళకు రోజువారి భత్యంగూడా గడవదు. వాళ్ళకు గడవకపోవటం అల్లా ఉంచండి. జమీం దారుగారికే అనేక విషయాలు గడవ్వు.

జమీందారుగారుకూడా వాళ్ళ మామూలు ఆచారాలు గడిపేటప్పుడు వాళ్ళవల్ల డబ్బు ఖర్చయ్యేటట్లు, యివన్నీ దురాచారా లనుకుంటాడుగాని; వాళ్ళవల్ల తనకు దమ్మిడీ ఖర్చు కాకుండా వాళ్ళు తనయందు ప్రభుభక్తి చూపించాలనే అనుకుంటాడు.

ఇదివరకు ఒకసారి చెప్పాము. ఆ వూళ్ళో సుమారు ఒక పాతిక బ్రాహ్మణ కుటుంబాలున్నవని. వీరు పూర్వపు జమీందారుని రక్షించి ఈ జమీ వీరికి వశంచేసిన ఒక బ్రాహ్మణుని యొక్క కుటుంబం పెరిగి ఈ పాతిక కుటుంబాలైనవని; జమీందారుగారింట్లో వివాహమైతే రెండువేల రూపాయలూ ఈ కుటుంబానికి కట్నం చదివించాలని. వీరందరు రాజాగారి పురోహితులు. ఈ పాతిక కుటుంబాల మొత్తంమీద ఒక వందమంది పురుషులున్నారు. ఈ వివాహం జరిగి ఆ కట్నం వస్తే తలా యిరువది రూపాయలు వస్తవి. ఈ వందమందిలో అందరు నిర్ధనులు కారు. యాభై మంది పైగా అనేక ఊళ్ళల్లో ఉద్యోగస్తులు. నెలకు వంద, రెండు వందలు, పాతికలు తెచ్చుకుంటూ ఉద్యోగాలు చేసే వాళ్ళు. మిగిలిన యేబదిమందిలో పాతిక ముప్పదిమంది ఏదో వాళ్ళబ్రతుకు వాళ్ళు బ్రతికేవాళ్ళు. ఈ పెళ్ళి జరిగితే ఈ యిరవై రూపాయలు వస్తుందని ఆశ. కాని తక్కిన వాళ్ళకు గరుజులేదు. కాని తమ జమీందారుగారి కూతురు

పెళ్ళి అగుచున్నది. దానికి వందమంది వెళ్ళాలి: కట్నం పుచ్చుకోవాలి. అది తమ గౌరవం. అది తమ కొక సరదా; ఒక ఉత్సాహం.

ఈ ఉద్యోగాలు చేస్తున్న అన్ని ఊళ్ళల్లోనుంచి నాలుగురోజులు శెలవుపెట్టి వందమంది మద్రాసు చేరారు. చేరితే వీళ్ళకు ఆలనా పాలనా లేకపోయింది. దొరగారు వీళ్ళందరు ఉండేందుకు ఒక యిల్లయినా యేర్పాటు చేయ లేదు. రాజబంధువు లొక మేడలో ఉన్నారు. అక్కడికి పోతే ఆ దొరలు వీ ళ్ళెవరితో మాట్లాడలేదు. వాళ్ళ మడత మంచాలు, వాళ్ళ పరుపులు, వాళ్ళ పరిచారకులు ఆ మేడంతా వాళ్ళతో కిటకిటలాడిపోయింది. ఈ వందమంది పురోహిత కుటుంబం ఎక్కడుంటారు? మద్రాసు కేమి? పెద్ద ఊరాయె. గడప వదిలితే గడప కాఫీహోటలాయె. సందు వదలితే సందు సినిమా ఆయె. ఈ వందమంది కాఫీహోట ళ్ళను బాగుచేశారు. మిలటరీవాళ్ళను తలదన్నినట్లుగా సినిమాహాలులు నింపారు. ఎక్కడో తిన్నారు. ఎక్కడో పడుకున్నారు. ఇల్లా ఉండగా వచ్చిన రాజబంధువులలో వచ్చిన పురోహిత కుటుంబములోనివారిలో కొందరంటే కొందరికి గౌరవం. చివరికి ఏ తాలూకాఫీసులో ఉన్నా చాలు. వారితో ఏదో పని ఉంటుందిగా. అందుచేత ఈ రాజబంధువు లంతా పూర్వ మీా ఉద్యోగస్తులకు దణ్ణాలుపెట్టేవాళ్ళు, పలకరించేవాళ్ళు, పలకరించరు. మర్యాద చేసేవాళ్ళు, చేయరు. ఇది రాజబంధువుల బిగువు కాబోలు!

ఎల్లాగయితేనేమి సరీగా పెండ్లివేళకు వందమంది పురోహితులు చేరారు. హాలు కిటకిటలాడిపోయింది. కాని యీ వందమంది ఆ హాలులో కాసావాళ్ళకన్న కనాకష్టం అయినారు. ఎందుచేతనంటే - కాసావాళ్ళకు - వాళ్ళకు నియమితమైనపని ఉంది. వాళ్ళు వృధాగా ఉన్నట్లు కనుపించింది. హాలంతా హైకోర్టు జడ్జీలు, న్యాయవాదులు, పెద్దపెద్ద ఉద్యోగస్థులతో నిండిఉంది. ఈ పురోహితులవంక చూచేదెవరు ? ఈ కూర్చున్నంతసేపు యిందులో కొంచెం ఉద్యోగాలు అవీ చేసేవాళ్ళు జమీందారుగారు తమవంక చూస్తారేమోనని కనిపెట్టుకొ ఉండి చూచినప్పుడు నమస్కారం చేస్తూ వచ్చారు. చూచినప్పుడు జమీందారుగారు పలుక రిస్తారేమోననీ, నవ్వుతారేమోననీ, కనీసం 'వచ్చారా' అన్నట్టు చెయ్యైనా ఆడిస్తారనీ ఎవడుపడితేవాడు ఆశపడ్డాడు. కాని వాళ్ళల్లో ఒక్కడైనా ఆమాత్రం భోగానికి నోచుకో లేదు. చివరకు చూడగా చూడగా ఏమనిపించిందంటే వీళ్ళందరూ రావటం జమీందారుగారికి యిష్టమే లేనట్టని పించింది. పెళ్ళి అయిపోయింది. ఒకరు కాకపోతే ఒకరు ఒకరిని కాకపోతే ఒకరిని 'ఎప్పుడు వచ్చారు ? భోజనం ఎక్కడ ? మీసంగతి ఎవరైరా చూస్తున్నారా ?' అని అడిగిన పాపాన పోలేదు. ఇంట్లోంచి తోసివేస్తే దూలం పట్టుకు వ్రాకులాడినట్లుగా వీళ్ళంతా ఏంచేశారంటే పోయి హోటళ్ళలో భోజనంచేసివచ్చి రాజబంధువుల విడిదిలో వరండాలో పడుకున్నారు.

అక్కడికి పురోహితుల పెద్దకుటుంబంలో పెద్దాయన వచ్చాడు. జమీందారుగారు కట్నం యివ్వనని తేల్చాడు అని చెప్పాడు. అంతటితో అందరిమనస్సులలో కోపాలు బయటకు వచ్చినై 'ఒరేయి! వీడికోసం రైలుచార్జీలు పెట్టుకు వచ్చారా. మనకట్నం మనకిస్తే ఖర్చులమాట తర్వాత చూద్దాము. జమీందారీ వీడిసొమ్మట్రా! మన ముత్తాత వీళ్ళముత్తాతను నిలబెట్టకపోతే వీడికి జమీందారీ ఎక్కడిదిరా?' ఈ రకాలుగా యిందులో కొన్ని తిట్లు కలిపి అందరూ యథేష్టంగా మాట్లాడారు. ఈతిట్లుఏ రాజబంధువులు వింటే జమీందారుగారి చెవులపడతాయో, ఆ రాజబంధువులు వినేటట్లు తిట్టేరు. ఒకటేమిటి అవాకులు చెవాకులు—లక్ష.

చివరకన్నారుకదా యీపెండ్లి బాగుపడి ఏడుస్తుందా. ఇంతమందిని ఉసురుపెడితే యీాయన సంసారం సరీగా సాగుతుందా అని కొన్ని శాపనార్థాలు పెట్టేరు. ఇలా జరిగితే రాజబంధువు లూరుకున్నారా? యీ సంగతి తెలిసి జమీందారు ఊరుకున్నాడా? అని ప్రశ్న పుట్టవచ్చు ఊరుకున్నారు. ఊరుకోక ఏమిచేస్తారు? జమీందారుగారు చేసినదంతా బ్రిటిష్ గవర్నమెంటువల్ల వచ్చిన భావవిప్లవం. వీరినేమైనా చేస్తే క్రిమినల్, అదీ గవర్నమెంటే!

## ౧౪

వివాహమైన తరువాత జమీందారుగారిఊళ్ళో శోభ అనేది ఏమీాలేదు. అదేమిటో అందరిమొగాలు ముడుచుకునే ఉన్నవి. పొరుగింటి శ్రీ మహాలక్ష్మి తనింటికి జ్యేష్ఠా

చేస్తే పెద్దమ్మ అన్నట్లుగా జమీందారుగారికి తనఊళ్లో వున్న వాళ్ళకి దమ్మిడీ యివ్వటం కష్టంగా తోచింది. పరాయి ఊళ్ళో వాళ్ళకి ఇచ్చిన రూపాయలు లెక్కలేదు.

అరెరే! యీదేశాన్ని ఏదో ఒక చిత్రమైన ఆర్థిక వ్యూహం చుట్టుకుంది. పూర్వసంప్రదాయం అంటే, పూర్వాచారాలంటే, పూర్వసంస్థలంటే, పూర్వదేవతలంటే ఒక లెక్కలేనితనం. అవన్నీ దోషభూయిష్టాలనటం, పూర్వపు సంఘవ్యవస్థ అంటే ఒక నిరాదరణ, ఒక తిరస్కారం, ఒక నింద, ఒక విప్లవం. ఆ సంఘవ్యవస్థలో ఉన్న భిన్నైక దేశాలను ముక్కలు ముక్కలుగా చేయుట. ఈ సృష్టిలో నీ వెంత క్రొత్తదైనా తీసుకురా మంచి ఉంటుంది; చెడ్డా ఉంటుంది. గుణాలు ఉంటవి, దోషాలు ఉంటవి. ఈ దోషాలు ఆదర్శాలలో ఉండవు. అసలు మూలసూత్రాలలో ఉంటవి. ఆ మూలసూత్రాలు చాల ఆలోచించి లోకకళ్యాణం కొరకు చేసినవే. కాని అవి ఆచరణలోకి వచ్చేటప్పటికి ఆ ఆచరణ కొన్ని వందలయేండ్లు సాగేటప్పటి కిమనుష్యస్వభావంలో వున్న దోషాలు ఆ సూత్రాలను ఆ ఆదర్శాలను ఆవరించినట్లు కనిపిస్తుంది. సర్వదోషము మానవప్రకృతిలో ఉంది.

మనుష్యుడు స్వార్థపరుడు. తనుఅంటే ఉన్నంత అభిమానం పెరఅంటే ఉండదు. మనుష్యుడు తాను యేది ఊహిస్తే అది మంచిది అనుకుంటాడు. అసలు మనుష్యుడు సహజంగా వాడిఒంట్లో ఉన్న నెత్తురులో నిహితమైఉన్న గుణాలనుబట్టి ప్రవర్తిస్తాడు. వాడి నెత్తురు వాడిజాతి, అది వాడివర్ణము. అది వాడిజాతికి వాడివర్ణానికి అనుకూలమైన

గుణాలు కల్పిస్తుంది. రహస్యమంతా ఈ రక్తంలో సహజంగా ఉన్న గుణాలు ఇతరములైన పరిస్థితులచేత యే కొంచెమో మారితే మారవచ్చుకాని, ఆ రక్తమందు నిష్ఠమై ఉన్న గుణాలకు ప్రాబల్యం తప్పకుండా ఉంటుంది. ఈ గుణాలు తండ్రియొక్క రక్తసారమైనది. రేతస్సులో ఉంటవి. ఆ రేతస్సే ఈ సృష్టికంతకీ మూలకారణం. రేతశ్శుద్ధి సృష్టి పాటించుకున్నంతసేపు గుణాలు పరిశుద్ధంగా ఉంటవి. మన దేశంలోవున్న వర్ణవ్యవస్థలలో ఉన్న రహస్యమిది. భగవంతుడు 'స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః' అని చెప్పింది దీనికోసం. వర్ణసంకరం విపరీత గుణాలకు హేతువవుతుంది. స్వధర్మమునందు హేయభావాన్ని కల్గచేస్తుంది. పరధర్మమందు అభిమానం హెచ్చిస్తుంది. సృష్టిలో ఈ నాడు ఒక్క హిందువులుతప్ప తక్కిన అన్ని మతాలవారు తమజాతిని పరజాతి రక్తమిశ్రితం కాకుండా చూచుకుంటారు. ఈ హిందూజాతి రక్తంలో ఔదార్యం ఉంది. ఇతరుల భావాలను సమాదరించే ఓర్పు ఉంది. ఈ గుణాలను న్యాయంగా రక్షించుకోలేకపోతే సంఘం పాడైపోతుంది.

జమీందారుగారి ఊళ్ళో ఎవడిమొఖాన శోభలేదు. లేకపోయినా ఉన్నట్లు నటించాలి. లేకపోతే దైనందిన జీవితానికే భంగం. అందుచేత లేనిసంతోషం మొఖంలో తెచ్చుకోవాలి. కాని ఈ వివాహంవల్ల ఆ వూళ్ళో వున్న భిన్న కుటుంబాలకు నడిచే నడవళ్ళు సరిగ్గావస్తే వాళ్ళందరూ మేడలు కడతారా; మిద్దెలు కడతారా. మరీ పేద

వాళ్ళకు నాలుగైదు రోజులు చేతిలో వెసిలిక ఉంటుంది. ఈ మాత్రంచేత వచ్చే వెసిలిక కాని కొంచెం అన్నోదకాలు కలిగిన ఈ సంసారాలకు ఈ వెసిలిక పెద్ద పాటింపేకాదు. కాని ఈ నడవళ్ళి నడిస్తే అందరికి ఒక ఆనందం ఉండేది. ఎప్పుడూ పది రూపాయలవలన వచ్చే లాభం తక్కువ; తృప్తి ఎక్కువ. ఇంతమంది జనానికి ఆ తృప్తి లేకపోయింది.

జీవులయొక్క అంతర్భాగం పరమేశ్వర స్వరూపం అంటారు. పదిమంది మాటకు పాటి ఉందంటారు. ఈ కాలంలో జనసమూహం నారాయణస్వరూపం అంటున్నారు. ఈ మాటలో ఏదైనా నిజం వుంటే ఇల్లా నారాయణుడు పరమేశ్వరుడు కొంత బాధపడ్డారు. అవతలవాడు బాధపడితే ఇవతలవాడికి తగులుతుందని ఈ దేశంలో ఒక విశ్వాసం. ఈ భావాన్ని కసి తీరేటట్లుగా చెప్పినట్లుంటుంది ఒక వాక్యం 'సాధు సజ్జన సంతాపం కి మాశ్చర్య కులక్షయం' సాధువులు, సజ్జనులు పరితపిస్తే వాడు పరితపింపచేసినవారికులానికి అపకారం జరుగుతుంది.

ఒక చమత్కారం చూడండి. జమీందారుగారు ఈ పేదవాళ్ళకు పెట్టటం మానేసి పెద్దపెద్ద ఉద్యోగస్తులకు మోటార్లవాళ్ళకు ఇంకా అటువంటి జాతివాళ్ళకు పెళ్ళిలో పెట్టాడు. వాళ్ళవాళ్ళ భిన్నములైన అనుభవాలను విచారిద్దాము. కూతురు పెండ్లి చేసుకుని కలెక్టర్లకు గవర్నర్లకి జడ్జీలకు న్యాయవాదులకి ఉద్యోగస్తులకి వాళ్ళకి నిజంగా అక్కర్లేని డబ్బిస్తే వాళ్ళ మనస్సు ఎట్లా ఉంటుంది. రాజాగారు పెళ్లి బాగా చేశాడంటారు. అవసరం వచ్చినప్పుడు ఆయ

నకు మళ్ళీ ధనపూర్వకమైన సాహాయ్యం చేస్తారు. ఇంక మోటార్ల వాళ్ళకు యిస్తే అక్కడ ఈ మాత్రంకూడా లేదు. వాళ్ళకు అవసరం ఉంది. వాళ్లు ఎక్కారు. నాటకంవాడికి రూపాయి యిచ్చి టిక్కెట్టు కొంటే వాడు సంతోషిస్తాడా ? దానం అనుకుంటాడా? ఇవన్నీ నీ సంతోషంకోసం చేసేపనులు. నీ వనుభవించే ఆ సంతోషం ఒక దర్జాకోసం, ఒక ఠీవికోసం, ఒక బడాయికోసం కలిగే సంతోషం. ఈ డబ్బు పేదవాళ్ళ కిస్తే వాళ్ళ మనస్సు ఎట్లా ఉంటుంది? వాళ్ళ మనస్సంతా ద్రవీభూత మాతుంది. వాని సంసార పరిస్థితి ఎట్లాంటిదంటే వాడికి నీ విచ్చిన నాలుగురూపాయలకు వాడి వళ్లు కోసి యిచ్చినా నీయందలి కృతజ్ఞత తీర్చుకోలేనేమో అనిపించేది. అప్పుడు వాడి మనస్సులో కలిగే ఆర్ద్రిత లౌకికమైందికాదు. నీకు ప్రత్యుపకారం చేద్దామనేదికాదు. ఇది ఐహికమైనదికాదు ఆధ్యాత్మికమైనది. నీవు ఉద్యోగస్థులకు డబ్బిస్తే వాళ్ళు నీకు ఐహికంగా ఎట్లా ఉపయోగపడతారో ఆ ఉపయోగాన్ని ఎల్లా వాంఛిస్తావో అల్లా ఆధ్యాత్మికమైనది ఒకటి ఉన్నదని నీవు విశ్వసించి దాన్ని వాంఛిస్తే ఈ పేదవాళ్ళకు ఆ డబ్బు యిస్తావు. వాడికి వందరూపాయిలు యిచ్చేచోట వీడికి పది రూపాయలు యిస్తే చాలును. వాడికి వందరూపాయిలు ఇచ్చి నీవు కలిగించలేని తృప్తి వీడికి పదిరూపాయిలిచ్చి కలిగిస్తావు. ఆ ఆధ్యాత్మికఫలం నీవు వాంఛిస్తే, అని చెప్పిన మాటలలో అర్థం యేమిటంటే-వాంఛ అనేది రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి మనోదఘ్నమై ఉంటుంది. అంటే ఆ వాంఛ మనస్సుకు తెలుస్తుంది. రెండవది హృదయం

లోనే ఉంటుంది. ఏ భావమైనా మనస్సుదాకా వస్తేకాని మనుష్యుడు తెలుసుకోలేడు. హృదయంలో నెత్తురులో సంస్కారరూపంగా మనుష్యుడికి అనేక భావాలు ఉంటవి. ఆ సంస్కారాలకు బలం తక్కువైతే ఆ వారడిబలం మనస్సుకు ఉంటే మనస్సు వాటిని చంపేస్తుంది. ఆ వారడి బలం మనస్సుకు ఉండటం అంటే మనం ఒక చదువు చదివి చుట్టూఉన్న పరిస్థితులచేత కొన్ని భావాలకు ప్రాబల్యం మనస్సుకు పట్టించుకోడం. యిల్లా జీవితం తప్పుత్రోవ పోతుంది. ఇదిగో చూడండి, ఒకటి ఐహికం; రెండు ఆముష్మికం. ఈరెండు చెరిసగంగా మానవునిలో ఉంటుంది. పూర్వసంఘువ్యవస్థ ఐహికానికి జీవయాత్రకు కావలసిన వెల కట్టి ఆముష్మికానికి ఎక్కువ వెలకట్టింది. ఇప్పటి సంఘం ఆముష్మికం లేనే లేదంటోంది. ఆముష్మికం అనేది ఎక్కడో ఉందనుకోడంలో ఉంది. పైన చెప్పిన ఉద్యోగస్తుల యొక్కయు, పేదవాళ్ళయొక్కయు తృప్తిలక్షణం విచారిస్తే ఆముష్మికం ఈ సృష్టిలోనే, ఈ మానవులలోనే ఉందని తెలుస్తుంది. ఆ ఆముష్మికానికి గంత బొంత తొడిగి పసుపు పెట్టి కుంకుమ పెట్టి దానిని దేవుడని, క్షేత్రాలని, వ్రతాలని చేశారు. అట్లా చేయకపోతే నీ వసలు దానివంక చూడవని. ఈ ఐహికంకన్న ఆ ఆముష్మికం ఎంతో బలంకలది. ఐహికంయొక్క బలం ప్రత్యక్షంగా కనిపిస్తుంది. నీవు ఉద్యోగస్థుడికి నిజంగా యిచ్చేది లంచం. ఆ లంచానికి మర్యాదా చొక్కావేసి యిస్తావు. పేదవాడికియిచ్చేది దానం. దానికి మర్యాదా చొక్కాలేదు. దయ అనేది నీ గుండెలో పుట్టాలి.

పుడితే యేది దైవమంటున్నామో ఆఆముష్మికానికి సంబం
ధించిన బ్రతుకు బ్రతుకుతావు. ఉద్యోగస్థుడికి లంచంయివ్వవు
ప్రత్యక్షంగా నీపని పాడవుతోంది. వాడికి నువ్విచ్చేలంచం,
వాడు నీకు చేసే ఉపకారం; దానివల్ల నీ ఆస్తిపాస్తులు
సురక్షితంగా ఉండటం యిది ఒకలోకం. పేదవాడికి నీ విచ్చే
దానం వాడుపొందే తృప్తి. ఆ తృప్తివల్ల వాడు నీకు మేలు
కలుగవలెనని కోరడం, దానివల్ల ఈ దయాలోకాలల్లో
కలిగే సంచలనం. ఆ సంచలనం నీకు ఈ దానానికి ప్రతి
ఫలంగా ఏదో చెప్పరాని ఒక సుఖహేతువుగా ప్రకాశించడం.
యిదంతా ఒకలోకం. ఉద్యోగస్తుడికి డబ్బు యివ్వవు. వాడు
నీ కపకారంచేస్తాడు. పేదవాళ్ళయందు దయ చూపించవు.
దానికి నీ కపకారం జరుగుతుంది. నీకు అప్పుడూ అపకారం,
యిప్పుడు అపకారం జరుగుతుంది. ఆ అపకారం యెవడో
చేసినట్లు కనిపిస్తుంది, తెలుస్తుంది. ఈ అపకారం చేసినవాడు
కనిపించడు. ఇది దానిఫలితమని తెలియదు.

వివాహమైన తరువాత రెండు నెలలకుగాని జమీం
దారుగారి సంసారం తమ ఊరు తిరిగిరాలేదు. పెండ్లిహడావిడి
అంతా తగ్గిన తర్వాత చిన్నరాణీగారు తిరుపతిమొక్కు
తీర్చవలెనని పట్టుపట్టింది. పెండ్లికూతురు నిలువుదోపు
యివ్వాలి. పెండ్లి అయినతర్వాత భూదేవి ఒంటిన రెండు
లక్షల జవాహరీ ఉన్నది. ఇదంతా యివ్వాలనికాదు. జబ్బు
చేసినప్పుడు ఆవిడ ఒంటిమీద ఆరువేల నగకట్టు ఉంది. అది
ఆ స్వామికి కానుక యివ్వాలి. రెండవది చిన్నరాణీగారు తన
తలకట్టు స్వామికిస్తానంది. దీనిని గురించి తర్జనభర్జనలు

జరిగినవి. ఈ రెంటికి జమీందారుగారు ఒప్పుకోనలేదు. చివరికి నగకట్టిచ్చేందుకు ఒప్పుకొన్నారు రాణీగారు. తలకట్టు యిచ్చివస్తే ఆవిడకు తన సంబంధంలేదన్నాడు జమీందారుగారు. జమీందారుగారిదగ్గర యే యితరలక్షణాలున్నా భార్యఅంటే మహాప్రేమ. ఏకపత్నీవ్రతము. ఈ దేవతాగుణము ఆయనదగ్గర ఉన్నదని ఇదివరకే చెప్పాము. ఈ ఆత్మగుణానికి పట్టుదలకు యిప్పుడు సంఘర్షణ వచ్చింది. పట్టుదల లౌకికగుణం. ఏకపత్నీవ్రతం దివ్యగుణం. తక్కిన వాటన్నింటిలో జమీందారుగారు లౌకికానికే ఎక్కువ బలం సమకూరుస్తూ ఉండడంచేత లౌకికమైన ఏభావానికైనా ఆయన ప్రకృతిలో ఒక బలం సమకూడిఉంది. రాణీగారు ఒక్కర్తెయే తిరపతి వెళ్లింది. అంటే రాజాగారు మాత్రమే వెళ్ళలేదని అర్థం. భూదేవి వెళ్ళలేదు. ఆమె నగకట్టు రాణీగారు తీసుకుని వెళ్ళింది. మళ్లీ రాణీగారు తిరిగి వచ్చేటప్పటికి ఆవిడ తలకట్టు ఈయనే యిచ్చింది. జమీందారుగారు ఆవిణ్ణి చూచాడు. కోపంవచ్చింది. ఆ కోపం ఆయన వ్యక్తీకరించలేదు. వ్యక్తీకరిస్తే అంత యిబ్బంది లేకపోయేది. రోజులు గడచినవి. పక్షాలు గడచినవి నెలలు గడచినవి. మూడేండ్లు గడచినవి. రాజాగారు తనఊరు రాలేదు. పెద్ద చిన్న రాణీలు మాత్రమే ఊళ్ళోఉన్నారు. భూదేవిగారు మద్రాసు వదలిపెట్టి రాలేదు. ఆవిడ అక్కడే ఉంది. పెద్దరాణీ, చిన్నరాణీ కోటలోనే ఉన్నారు. రాజాగార్కి అదివరకులేని ఒకగుణం అలవాటైంది. పరస్త్రీ సంపర్కం. చిన్నరాణీ యిల్లా అనుకుంది: దేవుణ్ణి నమ్ముకుంటే యిల్లా చేశాడని.

కథ అంటే కాలాన్ని కలుపుకువచ్చేది. పూర్వం కొన్ని దేశాల కవులు ఈ కాలాన్ని పుస్తకం చదివేకాలంతో సమానంగా ముడిపెట్టాలని చూచేవాళ్ళు. అప్పుడు ఎంతకాలం కలసిరాదో అంతకథ కలసిరాదు. కాని మన దేశంలో అనాదినుంచి కవులు ఈ కాలాన్ని గురించి అల్లాంటి పిచ్చి ఊహలు ఊహించలేదు. ఒక పదేళ్ళమీద ఒక పని జరిగింది. ఈ పదేళ్ళలో పదిరోజులే జరగవచ్చు, ఈ పదిరోజులూ జరిగిన కథ పది ఊళ్ళలో జరగవచ్చు. ఆ వూళ్ళ మధ్య కొన్ని వందలమైళ్ళ ఎడం ఉండవచ్చు. కాలంలో యింతదూరం, స్థలంలో యింతదూరం, యివన్నీ దగ్గరకు వస్తవి. ఆ కథా బలాన్ని బట్టి ఈ కాలం, దేశము దగ్గరకు వస్తవి అని మన పూర్వులు మొదటినుండి తెలుసుకున్నారు. కాని ఈ దేశ కాలాలు రెండు దగ్గరకు వచ్చినట్లు కనిపించేందుకు కథలో అనేకాంశాలయొక్క బలాబలాలని పరీక్షించి బలములైన అంశాలని ఎగసనత్రోసి ఒక చమత్కారం చేసి కథను వ్రాసే వాళ్ళు. దీనినే శిల్పం అంటారు. ఈ శిల్పాన్ని గురించిన భావం అనేకులలో అనేకవిధాలుగా ఉంటూ వచ్చింది. మరీ అధునాతనంలో అదొక చిత్రంగా మారుతోంది. ఇంతకు చెప్పవలసివచ్చిం దేమిటంటే ఆ అతికే నేర్పే శిల్పమా? అతకటంలో కొంచెం వదులుగా ఉన్నా పనికివస్తుందా? అని. ఆడవాళ్లు కొన్ని నగలు పెట్టుకుంటారు. అది గొలుసనుకోండి. మధ్య అతుకు ఊడిపోతుంది. పెండ్లి పేరంటానికి వెళ్లాలి. ఏదో ఒక దారంపెట్టి కట్టి పెళ్ళి గడిపే

స్తారు. చూచేవాళ్ళకు నగ నగగానే కనిపిస్తుంది. ఒక పట్టెడో, ఒకనానో, ఒక పాంజేబు శీలలు పోవడం తాళ్ళుపోసి కట్టడం, ఆ నగయొక్క నగతనానికి లోపం లేకుండా తాత్కాలానికి పనికిరావటం అందరకి తెలిసిన విషయమే. అయితే తాత్కాలానికే కదా అంటారు. అసలు నగలే తత్కాలానికి సర్వకాలానికి సర్వకార్యాలువుంటే ఎలా సాగుతుంది ? ఉంటయ్యని అనుకోటంకూడా అంత న్యాయంకాదు. గడచిన మహాయుద్ధం, గడచిన అంటే మొన్నటిది కాదు, ఆ మొన్నటిది. దాన్ని గురించి ఒక లక్ష గ్రంథాలు ఉన్నవట. అవన్నీ చదివితేనే ఒక జీవితం సరిపోతుంది. పైగా ఈ అనంత కాలంలో యిలాంటి యుద్ధాలు లక్ష వస్తవి; పోతవి. ఆ యుద్ధాన్ని గురించే చదువుతూ ఉంటామా ? ఆ యుద్ధంలో ప్రధానాంశాలు ఒకటో, రెండో ఉంటవి. వాటిని గుర్తుపెట్టుకోమంటే పెట్టుకుంటారు. అట్లాగే కొన్ని తత్కాలానికే ఉపయోగిస్తవి. యిన్ని జాతులున్నవి. యిన్ని దేశాలున్నవి. యిన్ని భాష లున్నవి. ప్రతి కాలంలో ఏ కాలానికి ఆ కాలానికి అనేకమంది కవులు ఉన్నారు. ఈ అన్ని జాతులలో అన్ని భాషలలో కవులు వ్రాసిన గ్రంథాలన్నీ కుప్పగా పోసి, అందరూ అన్నీ చదవాలంటే సంభవమవుతుందా ? అన్నీ ఒకమోస్తరుగా ఉండాలి అనటం సంభవమా? అందుచేత తాత్కాలికపు గ్రంథాలు ఉంటవి. వానియందు తాత్కాలికమైన ఆదరము ఉంటుంది. తత్కాలమన్నమాట ఎట్లాంటిదో తత్పారకుడు అన్నమాట అల్లాంటిదే కనక సర్వగ్రంథమూ తత్కాలానికి, తత్పారకునికి.

ఈ విషయం గ్రహిస్తే తద్గ్రంథశిల్పమూ తాపన్మాత్రమైన శిల్పానికే. ఒక పుస్తకం అందదుకులుగా ఉంటుంది. ఛీ! యిల్లా వుందేమి అంటే అని అంతేనని మనవి. తాడుపెట్టి అతికిన నగను గురించే చెప్పాంగదూ!

ఇంతకూ యిదంతా ఎందుకంటే, ఇది చివరి అధ్యాయం. వెనక అధ్యాయంలోనే ఎన్ని ఎడాలున్నయో ఏమి పొసగింపులున్నయో కవికే తెలియకండా ఉంది. అయినా ఇందులో ఒక సామరస్యం వుంది. కవి అప్పుడప్పుడు వ్రాస్తున్నాడు. పాఠకుడు అప్పుడప్పుడు చదువుతున్నాడు. అంతా వేసి ఒక పుస్తకంగా వేసినప్పుడు మరికొంత బాధ ఉంటుందిగదా అనవచ్చు. అప్పుడైనా ఒకసారే చదవకుండా ఉంటేసరి. ఇది ఒక ఉపాయం అనుకోండి.

నీలకంఠశాస్త్రికొడుకున్నాడే అతగాడికి పిచ్చికుదిరింది. అంటే ఒకపాళంగా కుదిరింది. ఈ కుదరటానికి రెండు, మూడు కారణాలున్నవి. ప్రథమకారణం నీలకంఠశాస్త్రి గారికి దివాన్గిరీ పోయింది. పోకండావుండటానికి వీలుపోక పోయింది. ఎంచేతనంటే ఆయన జాతిమతభేదాలు అంగీకరించకపోయినా, లేనట్లు ఆచరించినా, అది లేకండా వుండాలి అన్న ప్రభువుల్ని ఎంత ఆశ్రయించినా సూదికోసం సోదికి వెళ్ళినట్లయింది. అతను పుట్టినవర్ణం అది. అదికావటం వచ్చింది. ఆర్థికంగా పాపం! అతను యిబ్బందులు పడాల్సి వచ్చింది. ఈ కొత్తమతాలన్నీ డబ్బున్నంతవరకూ సాగే మతాలు అని తోచింది. అవి యేవో యీనాటి కాలేజీ చదువులు, ఈనాటి సంఘమర్యాదలువంటివి.

వాటికి జీవితంలో ఒక పాయా కావాలి. ఆ పాయా నిలబెట్టేందుకు తగిన డబ్బుండాలి. అవి అతనిదగ్గరే లేకపోయినయి. దానితో రామా కృష్ణా అనుకోటం తప్పింది కాదు.

నీవెంతయినా భగవంతుడు లేడూ అనూ. వాడు లేదు అనటానికి కారణం యింకేదో వున్నబలం. ఆ యేదో వీటిల్లో యేదైనా కావచ్చు. ఒకటి ధనం, రెండు సంఘ బలం. ఇవి రెండు చాలా ప్రధానం. ఈ రెంటిలో యేది లేకపోతే అప్పుడు దేవుడున్నాడు.

ఒక కథవుంది. ఒక నాస్తికుడున్నాడట. దేవుడు లేడనే తీవ్రవాది. తీవ్రప్రచారకుడు. ఒకప్పుడు అతడు గుర్రంమీాద యెక్కి షికారు పోయినాడు. ఒక వంతెనవంటిది దాటవలసి వచ్చింది. ఆ వంతెన జవుకు జవుకు. వెడల్పు తక్కువ. ఒకవైపున సముద్రం. రెండవ వైపున పెద్దలోయ. అది పర్వతప్రదేశం. ఆమీాదుగా వెళ్ళుతున్నాడు. ఎటుపడ్డా యింకేమున్నది. తన యింతటి విశ్వాసం, తన యింతటి తీవ్ర ప్రచారం ఏంకావాలి? తరువాత యేమవుతుంది? తరువాత అంటే యేమిటి? యేమన్నా వుందా. ఇంత ఊహ హఠాత్తుగా స్ఫురించింది. వెంటనే దేవుడున్నాడురా అనిపించింది. అయితే ఒక చమత్కారం వున్నది. వాడికే అల్లా స్ఫురించిందా? ఆ స్థితిలో అందరు నాస్తికులకూ స్ఫురిస్తుందా? ఇదంతా బహుసంస్కారాల ఫలితం. ఒకసారి స్నేహితుడొకడు, అతడు తాను నాస్తికుడు అనుకుంటాడు. అతనికి ఒకప్పుడు పెద్ద ఆపద వచ్చి ఆపదయొక్క తీవ్రత ఉన్నన్ని

నాళ్ళూ పరమ ఆస్తికునివలె ప్రవర్తించాడని విన్నాను. ఆ స్నేహితుడు నన్నొకరోజున అడిగాడుగదా 'నీవు నాస్తికుడైన వేనరాజును ఆస్తికుణ్ణి చేశావు. నన్ను చేస్తావా' నే నన్నాగదా 'నేను చేశానా? ఆస్తికుడు కావలసిన సంస్కార బీజాలు వాడిలో ఉన్నవి. ఆ పరిస్థితులు అట్లా పోసగి వచ్చేటప్పటికి వాడే అయినాడు' అన్నాను. అతనప్పటికి ఊరుకున్నాడు.

ఇల్లా నీలకంఠశాస్త్రి రామా కృష్ణా అనటం మొదలు పెట్టాడు. మళ్ళీ శుక్రవారాలు ఉండటం లలితాదేవి పూజా గుడ్డిలో మెల్లగా చేయటం ఆరంభించాడు. ఈ కారణాల వల్లనో మరే కారణాలవల్లనో, అసలు కుదరవలసే కుదిరిందో ఆయన కొడుకుపిచ్చి కుదిరింది. మన నీల వుందే, శిలారు స్నేహితురాలు, సోమేశ్వరం మేనకోడలు, ఆపిల్లను నీలకంఠ శాస్త్రికొడుక్కిచ్చారు. పెండ్లి అయింది. పిల్ల కాపురానికి వచ్చింది. శాస్త్రికొడుక్కి పిచ్చి నిమ్మదించింది.

